శ్రీ శుభమస్తు.

అర్జునాభ్యుదయం బను

# * విజయ విజయము *

  


గ్రంథకర్త:

ఆత్మకూరు

అంబటి లక్ష్మీనర్సింహారాజు


  


పండితులచే పరిష్కరింపఁబడి

తా॥ లగిశెట్టిపేట, ఆజిపురము

పూస్కూరు వెంగారావు, బుచ్చన్న

ప్రభు ప్రముఖుల ద్రవ్యసహాయంబున

వరంగల్ రామన్నపేట

శ్రీనివాస ముద్రణాలయమున ముద్రింపఁబడెను

చిత్రభాను సం॥ చైత్రం. మార్చి 1942. ప్రథమ ముద్రణము 500

# విషయసూచిక




౧ అర్జున జననము
౨ అస్త్రవిద్యాభ్యాసము
౩ మనోబలంబును
౪ అస్త్రవిద్యా ప్రదర్శనంబును
౫ గురుభక్తియు
౬ గురుదక్షిణ
౭ గుణకీర్తనము
౮ బ్రహ్మచర్యము
౯ లక్ష్యసాధనము
౧౦ మాతృవాక్య పరిపాలనము
౧౧ వినయానుపాలనము
౧౨ భూప్రదక్షిణము
౧౩ సౌందర్యము
౧౪ వైవాహికము
౧౫ కుమారజననము
౧౬ పరాక్రమము
౧౭ తపోనిష్ఠ
౧౮ ఇంద్రియనిగ్రహము
౧౯ సౌజన్యము
౨౦ భరతవిద్యా విశారదత్వము
౨౧ శౌర్యప్రకటనము
౨౨ ఉదాత్త వర్తనము
౨౩ బలనిరూపణము
౨౪ బంధుప్రేమ
౨౫ గురుపూజ
౨౬ సమయనిష్ఠ
౨౭ ప్రతిజ్ఞాపరిపాలనము
౨౮ విజయము
౨౯ దిగ్విజయము
౩౦ కలియుగవర్ణన
౩౧ ఉపసంహారము.

# పీఠిక.

ఈగ్రంథ కృతికర్తలు పూసుకూరువారను పద్మనాయకులు నాల్గుతరములనుండి వీరిపూర్వులు మహాదాతలు (ప్రస్తుతము మ॥ రా॥ వెంగాల్రావు బుచ్చన్న ప్రభువు ప్రసిద్ధులు వీరిగోత్రము రేచెర్ల గోత్రమనియు జిగట్లగోత్రమని వ్యవహరింపబడుచున్నది ఆకాట్లగోత్రమని కవి ప్రయోగించినాడు. ఈకవి యినిగేల దేశాయి ఆత్మకూరు నివాసి మ॥ రా॥ వెంకటశర్మరావు, వెంకటనర్సన్న దేశాయి సంస్థానకవి (౧౦) గ్రంథములు శతక, నాటక, కావ్య, నవలలు రచించెను యీవంశీయు లేడుతరము లితనివరకు మహాకవులై ప్రసిద్ధిజెంది రితనికి హనుమంతరాజు ధర్మరాజు, సుందరరాజు, నారాయణరాజు అను నల్గురు కుమారులు తురుష్క హూణ కళాభ్యాసులు కవిత్వపరిశ్రమ జేయుచున్నారు వారి కృపచే లభించుగాక అంబిక వంశమాతని తల్లి భాగీరథమ్మ తండ్రి సుందరరాజు భార్య రంగనాయకమ్మ రాజమాపితుండగు యీకవి కిప్పుడు ౧౭ వత్సరములు వయము చిరంజీవియై వర్ధిల్లుగాక.

ఇట్లు

మరింగంటి నరసింహాచార్యులు

ము॥ నుగలవీడు.



# కవులయభిప్రాయములు

ఉ॥ కావ్యములెన్నియో ౹ కలియుగంబున బుట్టె ననేకరీతులా
కావ్యములందు రసోచితవి ౹ కాన పదార్థము లొంటవిక్కఁబీ
కావ్యము బాలవృద్ధులకు ౹ గానవనీయము శాస్త్రవైదగుఁ
కావ్యములన్ననీకు శతకంబుల ౹ బోలిచఁదించి చెన్నయో ॥

క॥ నీరచిత విజయ విజయము భారతకథగాన చెవులపండువుగా జే
నూరార జేయు చదివెడు వారికి రస శబ్ద గద్య పద్య స్ఫూర్తిన్॥

ఇట్లు
శ్రీ. బీ. నృసింహారంగాచార్యులు అవధాని నెల్లికుదురు

చ॥ ఇదియసమాన మియ్యది కవీశ్వర మానసరంజకంబు ని
య్యదియె సుధీజనేప్సితము నియ్యది భారతికున్నిపట్టు ని
య్యదియె రసాలవాలమని యెంతయు నెన్నగజాలు నజ్జనా
భ్యుదయమితోధికంబుగ మహోన్నతిజెందుత భూతలంబునన్॥

ఇట్లు
శ్రీ. బీ అళమా శింగరాచార్యులు, నెల్లికుదురు

చ॥ అరసితి భట్టువంశజుల నచ్చటనచ్చట కొందరిన్ మహా
సరసకవిత్వ చాతురి విచారగులన్ భువినెందు నీక్రియన్
నిరుపమ మాధురీ రసవినిర్మల గాంగనదీప్రవాహ వా
గ్గరిమగనంగలేదు మృషగాదు నరాభ్యుదయంబు జూపదున్॥

ఇట్లు
వెల్లుల రామగోపాలరావు రే. ండ బాలకవి.

గీ॥ విజయవిజయా ప్రబంధంబు వీనులార
వింటి కనుగొంటి రసశబ్ద విభవఫణితి
వ్యర్థ పదదూర గద్య పద్యార్థ పటిమ
జెలగు నీకృతి లక్ష్మీనృసింహరాజ!

ఇట్లు భాషాభిమాని:
కురికేల కేశవరావు, గుండి.

క॥ అభ్యుదయమార్గంబుగ కర్ణాభ్యుదయము జెప్పి యర్జునాభ్యుదయము నా
లభ్యముగ జెప్పితివి సౌరభ్యము స్వర్ణమునకొదవి రాజిలుభంగిన్

ఇట్లు
కోట వెంకటనారసింహారెడ్డి, పాడుక.

శ్రీశుభమస్తు

# * విజయ విజయము *

## ప్రథమాశ్వాసము.



### ఇష్టదేవతా ప్రార్థన.

శా॥ శ్రీవామాక్షి యురఃప్రదేశమున బల్కన్ – జెన్నొంద భూదేవి లీ
లావాసంబగు పీఠమైయెదనరన్ నీ – ళాదేవి నెమ్మేని కెం
తో వన్నెల్ గురుపన్ రవీందు – లిరుకన్నుల్ గాఁగ శోభిల్లు రా
జీవాక్షుండిల నేలుగాత శుభ – దృష్టిన్ వెంగరాయాదులన్॥

మ॥ దరమౌ కంఠము చక్రమౌ జఘనము – ద్యద్వేణి ఖడ్గంబగున్
శరశార్ఙ్గంబగు భ్రూలతంబు – మణియందంగొప్పు నోష్ఠంబు నా
యిరుకన్నుల్ చెవికుండలంబులగు ల – క్ష్మీనీవు నాసాధ్వి వం
చెరుగన్ జేసితివన్ వాఁ నగెదు – శ్రీయేలున్ గృతిస్వాములన్॥

ఉ॥ నీకువివేకమౌఁగరుప – నేరనుగాని తలన్ ధరింప మం
దాకినియేడ నార్యనగు – నన్నర మేనధరించు టేడ నీ
కీశ్వరతయ్యె పౌరుషము దేమని – యుల్లిన గౌరవేను లో
కైకవిభుండు శంభుఁడు దయన్ – గృతినాథుల నేలుగావుతన్॥

మ॥ గదియన్ బోవుచు తొండమెగ్గి చెవులన్ – గాసిల్లగా జేసి చు
ల్కదనం బెల్కన్ నర్భినావటర – వెన్కయ్యన్ కుమారా యనన్
బదిరెండక్షులు నారు మోములని పా – పాయంచు వేల్గుచ్చు పే
మిది నాయుర్వర బుజ్జగించు సతి తా – నేలున్ గృతిస్వాములన్॥

చ॥ అనయము సద్గుణాత్మునకు – నాయువునీయ పఖండ విత్త సా
ధనునకు ధర్మవృత్తిని సుత – ప్రకరంబిడవేము సృష్టి నా
విని సతి నీవా యాశు సుకవిన్ – బహుశాస్త్రపరిజ్ఞభూరిగా
భూరిన నిపుణు జేయకుందువని – నవ్వెడు వేలుపు నిచ్చలోమతన్॥

ఉ॥ గానము నాట్యకౌశలము – కావ్యసుకల్పన వేదశాస్త్ర సం
ధానము సర్వవిద్యల విధానము – గాంచినవాడు సుపదన్

బూనడటన్న పాపదలబూనిన । గర్వోదయుఁగుఁ గువిద్యులఁ
గానడటొచు లక్ష్మిని పకాపక । నవ్వెడు వాణిగొల్చెదఁ॥

చ॥ తిరుపతి వెంకటేశ్వరుని । దివ్యుని ధర్మపురీ నృకేసరిఁ
స్థిరముగ నాత్మకూరున వసించిన । కృష్ణుని నాయుపాస న
స్ఫురణ మహాత్మ్యగంధవహ పుత్రుని । విఘ్నములొప్పకుండ నా
కరివదనుఁ నిరంతరము । కౌశలభక్తిని సన్నుతించెదఁ॥

క॥ శాంతిమతి । సాధ్వికి ఘణి । శాంతునియంశమువగన్ని । కలుషాత్ములరా
ద్ధాంతంబుగ నడచిన సు। స్వాంతుఁ రామానుజార్యు నాత్మభజింతుఁ

శా॥ పుట్టంబుట్టియు వేల్పుబాస । కయితఁ బుట్టించె నెవ్వాడు చే
పట్టం జేసె నెవాడు ప్రాయితుకులఁ । బత్తిన్గాపించి క
న్పట్టెన్ గాళినెవండు కట్టెమిట । నేనే నీవటంచాడ మేల్
పట్టుఁ దట్టగ నమ్మహాత్ములకు । శుంభద్భక్తి కేల్మోడ్చెదఁ॥

మ॥ కరమొప్పారఁ దెలుగు లేకవనముఁ । గన్నయ్యనన్నయ్య నూ
పిరిగా దానికి వన్నెవన్నెమినుకుల్ । పెక్కెన్నతిక్కన్న బల్
బిరుదుల్ గాంచిన మేటికై । సగాలకుఁ పెద్దన్న పెద్దన్న కే
సరిభూపాసన మూర్తిమూర్తిని । కళాంచన్మూర్తికై వేడెదఁ॥

సీ॥ లలిమరింగంటియు శహాశింగరార్యుల । పంచసంస్కారముల్ బరపు
గురుల । కోవిదాగ్రణులైన గుడిమిళ్ళయచ్యుతా । చార్యులమతస్థ
శాచార్యవరుల । మహనీయులగు పితామహుఁ ప్రపితామహుఁ । వర
బుగ్గరాజును నరుసరాజు । ననుగన్నతండ్రి సుందరరాజునిక మేన ।
మామ వెంకటరంగనామకవిని ॥ గీ॥ సంస్కృతాంధ్ర కవిత్వప్ర
శంసలక్ష । ణాద్యలంకారరసపద్య గద్యగరిమ । లరయదెల్పునయం
తిపట్టాభిరామ । శాస్త్రినిశతావధానిని సన్నుతింతు ॥

శా॥ చాలన్ జాలిని శక్తిచే తగిన । శాస్త్రవ్యాప్తియుఁ లేక వ
ర్ణాలాపంబుల బోక సంధుల సు । గత్యాప్తినైకోక్క శ
య్యాలంకార పదార్థఁ పాత్రతతి । చౌర్యప్రాప్తిచే కా క
వుల్, కౌలీనంబు వహింతురి। సూరులయెడఁ గానఁ ధరాభృత్స్థలిన్

చ॥ పరుసపదంబులన్ గొని ప్ర । బంధము కూర్చుట నామతంబు గా

దరయగ తేటతెల్లముగ। నందరికంపము గూర్చెదన్ పర
స్పర రసముప్పతిల్లగను। సాహితి లేదనబోకు డిందులో
నెరసులు గల్గియుండిన। గణింపకుడో కవులార మ్రొక్కెదన్॥
వ॥ అని యిష్టదేవతా వందన పూర్వకంబుగ కృతీశుల కాశీర్వాదంబులొ
సంగి సుకవి భూషణంబును కుకవి దూషణంబును గావించి యేనొక్క
పురాతనపుణ్య శ్లోక కథానిబంధనంబుగ ప్రబంధంబు రచియింపంబూని
యొకప్పుడు దాతలసందర్శనార్థంబుగ దేశాటనంబు గావించుచు గౌ
తమీ తీరంబు ప్రవేశించినంత నచ్చట,
సీ॥ ఆదలాబాద సీమాంతర లగిశెట్టి। పేటప్రదేశాన పాటికెక్కు
నాజిపురంబు విద్యలకాపురంబు రం। గత్సంపదల కల కాపురంబు(లు
నందున్న ప్రాసుకూరన్వయోద్భవమణుల్। పద్మనాయకులు సౌభాగ్యవరు
హెచ్చు వెంగారావు బుచ్చన్న దొరయున। రాజేశ్వరారావు రంగరావు
గీ॥ యోధయుగు చొక్కరావ్। జగన్నాధరావు మొదలుగల్గుప్రభుల్ సభా
స్థదనమందు। బుధ పురోహిత వంధి మాగధ జనంబు। లాప్త బాంధవ
మంత్రులు హర్ష మొదవ॥
సీ॥ ఘన నడిపల్లి వెంకటరావు గోన రా। జేశ్వరరాయ నరేశ్వరుండు
రసికాత్ముడొద్ది నారాయణరావు పెం। పెక్క సోదరుడైన తుక్కరావు
యనఘమేన్నేని నారాయణరాయడ। చ్యుతరాయ డొద్దితిర్పతివిభుండు
మహనీయు కలకుంటమాధవరావు శ్రీ। గోనముత్యమరావు గుణగణుండు
గీ॥ ఘనుడుకలకుంటవంశ వెంకటన్నసింగరావు మొదలైనబంధువర్గంబువిల్వ
త్రిల పెంపొంద నపుడు పేరోలగంబు। వెలగ నాయుండు నన్నుతగంగ బిలచి॥
వ॥ సగౌరవంబుగా సత్కారంబొనరించి సభాసదులు విన నిట్లనియె.
సీ॥ వర పాండవప్రభావంబు పచ్ఛన్న। పాండవమును యదువీరు ని
విజయంబు। హనుమద్విజయము ప్ర। హ్లాదచరిత్ర ప్రభావతీ ప్రద్యు
మ్న భవ్యకథయు। రఘువీర విజయంబు రహి సుమతీ నాట। కంబు
భారతము రుక్మాంగదయును। కవిజనానంద ము। ఖ ప్రబంధములను।
శతకనాటకములు కృతియొనర్చి॥ గీ॥ యాత్మకూరందు వెలసితి వౌన
నంగ। మఖ్య గద్వాల రాజప। ముఖులచేత। బహుమతుల చాల
నొందినవాడవీవు। క్షితితలంబున లక్ష్మీనృసింహరాజా॥

క॥ కర్ణామృత పేయంబుగ । కర్ణాభ్యుదయ ప్రబంధ కౌశలమే నా
కర్ణించితి నీరచనో । దీర్ణత జూచితిని నీ ప్రతీతిఁ దలఁచితిన్ ॥

వ॥ కావున కర్ణాభ్యుదయ కావ్యంబునకుఁ బ్రతి యజ్ఞనాభ్యుదయంబు
రచియించి మాకంకితంబు నిడు మయ్యది 'విజయ విజయ' నామంబు
గ వెలయింపుమని బహుమాన పూర్వకంబుగ పట్టాంబరంబులఁ గట్టి
నిచ్చి తాంబూలంబు నొసంగుటయు నేనానందంబుగ సంగ్రహించి
తద్వంశావతారంబు సభివర్ణించెద నివ్విధంబుగ,

## —( వంశావళి. )—

సీ॥ శ్రీనాయకకళా విశేషాంశసంభూత । విభవంబు గలవారు వెల్మవారు
శౌర్యగాంభీర్య చాతుర్య సౌందర్య భా । వితకీర్తి గలవారు వెల్మవారు
దుర్మదాంధ విపక్ష మర్మభేదనసబలా । విభూతి గలవారు వెల్మవారు
భరతఖండాభోగ ధరణీతలవ్యాప్తి । వినతి గాంచినవారు వెల్మవారు
గీ॥ రాన్నతాఖండసంస్థాన రాజ్యభార । రాజకీయప్రపంచవిరాజమాన పు
లసౌభాగ్యముగలారు వెల్మవారు । పేరుగలవారలందు పూస్తూరువారు ।

క॥ ఆయన్వయమున వోన్నా । రాయఁడు జన్మించె కల్వరాయని వలెనా ।
రాయని సరిశూరులు గల । రాయని యశ మొందె వేల్పురాయని మేల్మిన్

క॥ వోన్నా రాజాత్మజుఁడు । కన్నధరానాథుఁ డలరు ఘనదాత తదు వెంకన్న
ను రాయన్ననుమహి । మోన్నతిగనె నందు రాయ డోర్పుగ నొప్పన్ ॥

సీ॥ రాయరాయని కీర్తి రమ్యప్రభావంబు । నిఖిలదిక్కులకు వెన్నెలయు
నయ్యె । రాయరాయని పరాక్రమ విజృంభణమున । హితఘూక
ములకు పేరెండయయ్యె । రాయరాయని సుందర శరీరవిస్ఫూర్తి
మహిళావశీకృత మంత్రమయ్యె । రాయరాయని వితరణసాహసంబు ని
ర్జనాథులకు మందారమయ్యె గీ॥ స్థిరనిజాంగావ్రిగాంధార
సీమనిహిత । మండలగ్రామ విభవ సంపాదనప్ర । తాపసందీపితుండు
నుద్దండమూర్తి । రాయరాయఁడు సద్గుణోపాయవర్తి ॥

క॥ ఆ రాయన్నకు పుత్రులు । శ్రీరాముఁడు లక్ష్మణుండు శ్రీదశరథభూ మీ
రమణునకు జనించిన । తీరునఁ గలిగిరి జగత్ప్రతీతు లిరువురున్ ॥

మ॥ మనుజాధీశ్వరుఁడా కరీంనగరు కు। స్సాక్ బాదుషా పుత్రుఁ డౌ
య్యన గోల్కొండపురంబునుండియు వ। లీయుద్ధాలవిచ్చేసి బు
చ్చన కీర్తిన్ విని చేపనులిగొని తదీయా। కారమున్ దర్పాం
బున చిత్రించి కొనెన్ ముఖాముఖి కరం। బున్ బట్టి సేవించుచున్॥

క॥ వరబుచ్చన్నగ నెన్ ధ। ర్మరతుల శ్రీరామచంద్రరావున్ దామో
దర రావున్ సుతయుగ్మమున్। వరవిగను తురుష్క హూణ విద్యాసిధులన్

క॥ మరి రాజేశ్వరరావుకొ। నర పుత్రుండొకఁడు సత్యనారాయణ రా
వరిజయుఁ డుదయంబయ్యెను। హరికి మనోభవుడు గల్గినటుల గణింపన్॥

సీ॥ రంగరావునకు పుత్రత్రయంబు జనించె। శ్రీహరిరావు రంజితుఁడు లావు
లీల వెంకట మురళీమనోహరరావు। సత్యనారాయణ స్వామికరుణ
రసికుండు సత్యనారాయణరాయుండు। ఘనుఁడైన చొక్కరావునకుసుతుఁడు
సగుణుండు వెంకట నరసింగరాయుఁడు। ద్భవమయ్యె నానందభావనుండు

గీ॥ భవ్యరాజయ్య దొరయును బాపుసముచి। రంగరాయుండు శ్రీ చొక్కరాయు
డాజి। పురమునన్ గాపురంబుండ్రు భోగభాగ్య। ములను జెలగిరసత్కీర్తి
వెలయుచుండ॥

క॥ ఇంగితమణి బుచ్చమ్మకు। వెంకటరాయుండు సద్వివేక హితగుణో
త్తుంగుఁ డభంగుఁడు శ్రీనర। సింగారాయుండు గల్గి జెలగిరి గరిమన్॥

గీ॥ విమలసద్గుణములరావు వెంగరావు। కాపురము సంపదలమూల నాశిపేట
జెలగుచుండును ధర్మసంస్థితగుణముల। నతిధులభ్యాగతులకు కల్పతరువనగ

క॥ ధీరుండతనికి వెంకట నారాయణ। రావు గుణసనాధుఁడు విద్యా
దారుఁడు ముత్యమరావుకు। మారులు సౌందర్యమారకుమారులు శరాకల్

సీ॥ నరసింగరావుకు నందనులార్వురు। హూణ తురుష్క భాషోదితులును
మేధావ్రతుఁడు జగన్నాథరాయుండును। రసికుండు వెంకటరామరావు
గోపాలరావు ముఖ్యుడులావు శ్రీచంద్ర। శేఖరరాయుండు స్థిరగుణుండు
తిరుపతిరావు భాసురమధుసూదన। రావు రంజిల్లి రరాతిజయులు

గీ॥ కామగవికల్ప కుజసుధా కలశచంద్ర। కౌస్తుభైరావతంబు కంఠిగల్గు
తద్విధముగల్గిరి కజగన్నాథరావు। రహిసుతుని గాంచె నరసింగరాయమణిని

చ॥ చటులపరాక్రమస్ఫురిత। శకరితనూజుఁడు భీమరాయుఁడు
త్కటముగ శౌర్యమూనె। విమతప్రకరంబడగన్ సుకీర్తి లం
పటుఁడయి గాంచె చొక్కని। కుమారు కుమారుస బోలు శూరు వెం

కటవరసింగరావు నధికప్రియు । భావునినర్థి జీవునిన్॥

సీ॥ పరగనా వెంకట వరసింగరాయుండు । నల్లురఘుతుల నందముగ గాంచె
కుశల వెంకటరాజ గోపాలరాయుని । సూర్యనారాయణ క్షోణివిభుని
ధీరు వెంకటహరి నారాయణాఖ్యు । విద్యాసాగ రాహ్వయున్ ధర్మసుతుల
బలుకాశిపేటలో పలవసించురు వృద్ధి । మైమి చె పూసుకూరన్వయంబు
గీ॥ భాసురాసల్లగోత్రంబు ప్రబలుచుండు । కందముదలుగ చంద్రార్కమంద
ముగను । ధాన్యధనశ్రీభోగభాగ్య సంతానసౌఖ్య । ముల నొసంగియు
శ్రీహరి బ్రోచుగాత॥

షష్ట్యంతములు.

క॥ ఏవంవిధ గుణవంతుల । శ్రీవెల్మకుల ప్రభులకు నానందరస
శ్రీవాణీశాధులకు వెంగా । రావాది మనులకు ధర్మరససహితులకున్॥
క॥ శ్రీపూసుకూరు వంశకలాపులకు । సుధర్మగుణ కలాపులకు సుధా
లాపులకు మహాకీర్తి దిలీపులకు । సుగోపులకు దళితపాపులకున్॥
క॥ మండలపుర స్వపతుల కరి । మండలఖండలహితాంగ మహతులకు నిజాం
మండలపతి పాలిత భూ । మండల మండిత యశోబ్జ మండలులకికన్॥
క॥ వరబుచ్చన్నకు రాజే । శ్వరరావుకు రంగరాయ వరునకు కరుణా
కర చోక్కారావుకు స్థిర రత జగన్నాథరాయ రసికాత్ములకున్॥
వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పఁ బూనిన యర్జునాభ్యు
దయ నామాంతర విజయ విజయంబునకు కథాక్రమం బెట్టిదనిన,

— కథాప్రారంభము —

క॥ వనములలోపల నుత్తమ । వనమగు నైమిశమునందు వసియించిమహా
ఘనమైన దీర్ఘయాగం । బొనరించుచు సత్పురాణ యుక్తాత్మకమా॥
క॥ శుకశౌనక ముఖ్యమౌని । ప్రకరము సకలంబువిని పురాణకళా సా
ధకుడగుసూతుని గాంచియు । వికలకలోత్సుకతననియె వినయమెలర్పన్
క॥ విజయుండని పేర్గాని చి । గ్విజయము సాధించిమించు విబుధేశకళాం
శజుడగు ధనుంజయుని కథ । త్రిజగన్నుత తెల్పు తేటతెల్లము గాగన్॥
క॥ భగవత్సమ్బంధుడు స । న్నగ భాగవతోత్తముడు జనార్ధనసఖు డా
జగజెట్టికథలు శ్రావ్యము । భగవద్గీతల ప్రసిద్ధిబరపిన ఘనుడున్॥
వ॥ అట్టి భారతవీరుని చరిత్రం బాసాంతంబు వినవలయుం దెల్పవేయని య
డిగిన వైశంపాయనుండు జనమేజయునకుఁ దెల్పిన ప్రకారంబుగా,

క॥ వినుపించెద నాద్యంతము। వినుడని సూతజుడుపల్కె వినయాన్వితులై
ఘనులగుశుకశౌనక ముఖ। మునులకు సజ్జనచరిత్రమును నీవిధముల్

సీ॥ గోపురాగ్రస్థాన కుంభప్రచుంబిత। గోపురాగ్రస్థాన కేద్యములను
హీరమసారమణీ రమ్యసాల। మహితసాలింగ బృందములను
విశిఖాసనోపేత వీరమండల చయ। దిక్శిఖాంతలావాస వేశ్మములను
శారదేందుకళా విశాలసౌధాదుల। శారదాంమేలో మహీయము
గీ॥ వారణాహయోష్ట్ర రథ్యదుగ్యాగశాల। జాలముకపోతశారిక జాలమున
శుకపికాభోగ పంజరాంశుకలితంబు। దీపికంబైదనరు హాస్తి నాపురంబు

క॥ ఆపారులు సుగుణగణా। కూపారులు శాపవిహతి కోపారులు వి
ద్యాపారులాహితాగ్ని। వ్యాపారులు సర్వజన స్వహాపారగులున్॥

క॥ ఆరాజులు రాగాజులు। కేరాజులు కీర్తిపూర్తి పృథుపక్రమ తే
జోరాజులు వైభవము సుమ। నోరాజులు విక్రమప్రమణుతి మృగరాజుల్

క॥ బేరులు సంపత్కళలకు। బేయులు వారాశినిభ గభీరులు సుగుణా
ధారులు యాచకులకు మం। దారులు వర్ణింపగాను దామోదారుల్

క॥ శూద్రులు బలవిజిత బలు। భద్రులు ధనధాన్యభోగ భద్రులయుత గో
భద్రులు గంభీరమున స। ముద్రులు మణిహేమశూద్ర ముద్రిలు నిన్నన్

గీ॥ ఆపురంబేలు ధృతరాష్ట్రుడనునృపుడు। పాండురాజాగ్రజుండు శుంభద్బలుండు
శాంతనవరక్షితానేక సైన్యుడగుచు। తనుజశతమును గాంచె గాంధారివలన

గీ॥ పాండువిభునకు పాండవపంచకంబు। గల్గె పృథయందు మాద్రియందు గాంత
యందు। నాడులోనర్జునుండు మహామహుండు। దేవతావందనీయ ప్రభావుడలరు

వ॥ అమ్మహాత్ముని జననాది గుణంబుల నభివర్ణించెద నవి యెవియనిన: జననంబు, శస్త్రవిద్యాభ్యాసంబు, మనోబలంబు, శస్త్రవిద్యా ప్రదర్శనంబు, గురుభక్తియు, గురుదక్షిణ, గుణకీర్తనము, బ్రహ్మచర్యము, లక్ష్యసాధనము, మాతృవాక్యపరిపాలనము, నియమపాలనము, భూప్రదక్షిణము, సౌందర్యము, వైవాహికము, కుమారజననము, పరాక్రమము, తపోనిష్ఠ, యింద్రియ నిగ్రహము, సౌజన్యము, భరతవిద్యా విశారదత్వము, శౌర్యప్రకటనము, యుదాత్తవర్తనము, బలనిరూపణము, బంధుప్రేమ, గురుపూజ, సమయనిష్ఠ, ప్రతిజ్ఞాపాలనము, విజయము, ద్విజయము, సుఖసంహారంబు మొదలుగల కథావిధానంబు లాద్యంతంబుగ.

—( జననము )—

క॥ మునులార వీనులారఁగ । వినవలయును భారతైకవీర వతంసుం
డనిపించి వెలయుశూరుం। డను రాణ్మణియైన యర్జునుని జననంబున్

క॥ సతిరతిగతివిడి పాండు । క్షితిపతి యతిశాపవశము చేతన్ రాజ్య
చ్యుతుడై శతశృంగపు ప । ర్వతమున సతివలనుగూడి వాసము జేసెన్

ఉ॥ అచ్చటియాశ్రమంబున మహర్షులు స్వర్గము జేరబోవుచున్
వచ్చుచునున్న జూచి త్వరితంబునవచ్చి మునులార వత్తు నే
నిచ్చటనుండ నంచన మహీశ్వర సంతతిలేనివాడు రా
నిచ్చునె దేవతాపురికి వంచనజేయరె వేల్పులెల్లరున్ ॥

వ॥ కావున నీవు రాజార్హుఁడవు గావున మునులాడిన భూకాంతుండు చిం
తాక్రాంతుండై కుంతికి తన యుదంతంబెరింగించిన నక్కాంత దుర్వా
స మంత్ర వృత్తాంతం బాద్యంతం బెరింగించి ధర్మసంతాన విధంబున
కై తదాజ్ఞ వహించినంత,

గీ॥ దండపాణి యంశంబున ధర్మరాజు । వాయు సంయోగమునజేసి వడము
డియు జ । నించె కుంతి తనకాంతు గాంచి యింక । నొకకుమారుని
గనవాజ్ఞ నొసఁగుమనిన ॥

క॥ నాకేశుడు పాకారి త్రి । లోకాధీశుండు ధర్మలోలుండతనిన్
జేకొని రాజాజ్ఞా । సాకృతి రాణామరుగాంచు మబలా సుబలున్ ॥

వ॥ అనిబోధించి యుండ్రారాధించుమన తత్ప్రసాదంబున నింద్రసంయో
గంబున సద్యోగర్భంబున,

క॥ స్థిరపౌరుషుండు సిందాం। శరసోపేతుండు లోకజయుఁడౌ సుతుఁడు
త్తరఫల్గున తారాదిమ । చరణంబునగల్గె దశదిశల్ వెలుఁగొందన్ ॥

ఉ॥ పంచశరుండనంబరఁగు బాలుని జన్మదినంబునందు మ్రో
యించిరి దుందుభాళి నటియించిరి పెక్కునుతుల్ రసోక్తిగా
వించిరి పూలవాన గురిపించిరి యచ్చరలున్ సురల్ ప్రమో
దించిరి లోకమెన్నఁగ విధించిరి యర్జునుడంచు నామమున్ ॥

గీ॥ కార్తవీర్యార్జునునివంటి మనుజుడితండు। దివ్యశస్త్రాస్త్రములను సాధించి
మించి। దిగ్విజయమొందిశత్రులధిక్కరించె। వరలుననివచ్చెనంబరవాణివాణి

వ॥ అంత కుంతిసంతసిల్లి తన్మంత్రోపదేశంబున మాద్రి కశ్వినీదేవాంశంబున
నకుల సహదేవులు సద్యఃకాలంబున జనించిరి పాండుభూపాలుండు మహా

షులు హాసిఁబొందిరి. పాండవ పంచకంబు దినదిన ప్రవర్ధమానంబుగ నుండ కొండొక కాలంబునకు విధివశంబునం జేసి,

సీ॥ పాండుమహారాజు పంచత్వమొందె రెం । డవ భార్య మాద్రి సహగామి యాయెను । సంతలో సంతాప మెంతయో జెందియు । కుంతి సంతతిని నేగుఁ గని జూని । హస్తినాపురికి నొయ్యనవచ్చె ధృతరాష్ట్రు । పాలి కాతండు కృపాళుఁడగుచు । తనయులరీతి సోదర తనూభవులను । శోషించుచుండె చక్కని మనమున । గీ॥ కౌరవశతంబు యమడింభక వ్రజంబు । నితర నృపబాలకులు పాండుసుతులుఁగూడి । కృపదలిర్ప ధనుర్విద్య కృపునివలన । నేర్చుచుండిరి తమతమ నేర్పుఁగాలఁ ॥

—• అస్త్రవిద్యాభ్యాసము •—

క॥ భారద్వాజుని చెంతకుఁ । జేరి మహాభక్తి చేత సేవించు సదా
చారము దెల్పెద పార్థుఁడు । నేరుపుతో నస్త్రవిద్య నేర్చినరీతుల్ ॥

ఉ॥ అందరు సందడింబడి ర । యంబున పట్టణ బాహ్యభూములం
గందుక కేళిసల్పుచు ము । నం బలరార బరిభ్రమింపగా
కందుక మొండు లోఁబడె న । గాధ జలావృత కూపమందు నా
కందుక మావలంబడుట కై । తెగువెద్ది గ్రహించ రెవ్వరున్ ॥

క॥ ఇక నెవ్విధి వచ్చును కం । దుకమని చకపికలుగాగ తొందరపడు రా
జకుమార వర్గముం గని । ప్రకటితమతి ద్రోణుఁ డటకు వచ్చుచు నుండెన్

చ॥ శుభదధరాసురోత్తముఁడు । శౌర్యవరేణ్యుఁ డగణ్యమూర్తి కుం
భభవుఁడు పుత్రశిష్యపరి । వారయుతుండు సతీసమేతుఁడై
యుభవునిరీతి వచ్చి విన । యంబున బల్కె విషాదమేల భూ
విభుసుతులార పైకి బడవేయు । నుపాయము లేదె మీ యెడన్

క॥ మీ కాబంతి నొసంగెద । నీ కూపమగాధమైన నేమా నా వి
ద్యా కుశలత గనుఁడనుచును । పైకిన్ రాఁజేసె బాణబాణ ప్రతతిన్ ॥

వ॥ అప్పుడా కుమారులా మహాత్ముని ధనుర్విద్యా ప్రవీణత కచ్చెరువంది వీటికిం దోడ్తెచ్చి భీష్మాదుల కెఱింగించిన శాంతనవుండు సంతసించి కుంభసంభవుని సపరివారంబుగ సత్కరించి బాలురకు బాణవిద్య బోధించుండని నియోగించిన నగ్గురుండు పరమానంద భరితుండై బాలుర కస్త్రశస్త్రంబుల ప్రయోగంబు లెఱింగించుచుండ యొకనాఁ డందరిం గూడి ద్రోణుండిట్లనె

క॥ ఆకుంతీసుతు డన్నం । బాకటి పిల్లున భుజింప నటకీటక ప
క్షాకరవాతహతిఁ దీ । పాకృతి మాయుటయు నిర్ఘనంతటఁ గప్పెన్ ॥
ఉ॥ అతఁటివంటవాడు క్షణ । మాఁగుడు దీపము దెచ్చుదాఁకనన్
చేతికి మూతికిం గలదె । చీఁకుదనం బని నిత్యలాఘవో
పేతమతిన్ భుజించి తెలి । వింగల సేఁత లివేయటంచు సం
ప్రీతిఁగ లక్ష్యశుద్ధి గని । పెట్టినవాఁడయి ధీరుఁడాగ్రితన్ ॥
క॥ అక్షీణ ధనుఃకరుఁడై । యా క్షణమున కోటబురుజునందలి భేరిన్
సాక్షాద్ధ్వనఁ జేయుచు । రక్షుండై శరము లేసె ధంధణ్రమోయన్ ॥
క॥ ఆరవమంతట విని గం । భీరమనస్కుండు గురుఁడు భీభత్సుతఁ గాన్
జేరి యిది యేమన పార్థుఁడు । ధీరోత్తము లాఘవంబు తెలివిగలపనుల్
ఉ॥ వంటకమిడ్డ తట్టనిగ । వంకలసుండు పదార్థపంక్తిఁ గన్
గొంటిని చీఁకటున్ననట । కుంజను నవ్వియటంచు చేతితో
నంటుచు మెక్కుటన్ విడవ । నస్త్రశరాయుధ లాఘవంబు లి
ట్లుంటువటంచు నెంచితిని । యూహితమైన మనోబలంబునన్ ॥
వ॥ అనివిన్నవించి యంజలిఘటించి నిలచిన యాచార్యుఁ డిట్లనియె.
క॥ నీకంటె నధికుఁడీ భూ । లోకంబున లేక నిపక్కలువత ధనుర్విద్యా
కౌశల్యము నీకే । కాక శరాసికమొదులకా కనుపడుటల్ ॥
వ॥ అని తదాదిగ శబ్దభేది కవచధారణ మున్నగు విచిత్ర యుద్ధవ్యూహ
భేదనోపాయంబు లెఱింగించుచుండె నంత పార్థుండు,
క॥ అశ్రాంతకళా భోగపరి । శ్రమ భుజసంపబల పరీతము గురుభ
క్తి శ్రద్ధలు బుధనుత సుగు । ణాశ్రయములరంగ కౌరతయూనదగలదే ॥

-( అస్త్రవిద్యా సందర్శనము )-

క॥ ఆకుంభజ కరుణా పరి । పాకంబున నేర్చు బాణబాణాసన వి
ద్యాకుశలత గనుపరచె మ । హాకురురాణ్ముఖులు మెచ్చనయ్యర్జునుఁడున్
చ॥ శుభదినమందు పాండు కురు । సూనుల చాపకళాధురీణతా
విభవము జూపనెంచి కృప । భీష్మముఖాదుల కేర్పరించి కుం
భభవుఁడు వారువారునిలువం । దగుచోటు విశాలభూమి రం
గభవన మొక్కచో నిలుపగా । ధృతరాష్ట్రునితోడ దెల్పెనన్ ॥
క॥ జవిభుశటుల నొనర్చియు । వినయంబొప్పఁగ కుమార విద్యాసంద
ర్శనము నొనరింపఁగ నిలచెను । జనులానందంబునొంద సామంతులతోన్ ॥

క॥ ఆసమయంబున ద్రోణుం డాసభ కేతెంచి పాండవాదులతో మీ
మీ సంగతు లేర్పడగ శ రాసన లాఘవము జూపు డనియాజ్ఞయిడన్॥

శా॥ ధీనైపుణ్యముచేత కౌరవులు కుం తీనందనుల్ యాదవుల్
నానా బాణసమగ్ర లాఘవకళా లావణ్యముల్ జూపి రెం
తేనిన్ లస్త్రకహస్తులై స్వభుజ తూణీరంబులొప్పార నం
తానందించిరి కుంభసంభవ ధనుర్వ్యాపార మగ్గించుచున్॥

ఉ॥ ధీరత వారివారికొలఁ దిన్ శర విద్యలు జూపుచుండ గం
భీరులు ధార్తరాష్ట్రులును భీముడు ఘోర గదాపరిచారముల్
నేరుపుమీర జూపుచు బలిష్ఠత నొంపురులన్ మదేభ సం
చార విధంబు ధీకొనిరి శౌర్యము ధైర్యము లుబ్బగొబ్బునన్॥

వ॥ ద్రోణుండది వారించి యర్జునుని పాండిత్యంబు జూడుండని యాతనిని
నియోగించినంత,

ఉ॥ శ్యామలవర్ణుఁ డుద్ధత శరాసన రోపకలాప తూణ దో
ర్ధాముఁడు హేమకంకపట రమ్యుఁడు నభ్రవిభాసమాన సౌ
దామినిగూడు మేఘమన తానువెలుంగుచు చూడనొప్పె ను
ద్దామ పరాక్రమస్ఫురిత ధన్యుడు నర్జును డున్నతాకృతిన్॥

మ॥ గురిజెత్తున్ గురిదప్పకన్ గురుశరాంకుండై సమాలీఢ పా
దరతిన్ మండలతా విశాఖగతి ప్రత్యాలీఢతా దీప్తతన్
మెరసెన్ బాణకళాప్రవీణమున పా ణిస్ఫారజా నాయుధో
త్కరసంధాన విధానముం దెలుప రంగంబంద భంగక్రియన్॥

క॥ అపరాద్ధపృషత్కుఁడు గా కపరస్పర లక్ష్యశుద్ధి కౌశలమును నే
ర్పుపురన్ జూపెన్ సభ నృపక కృపగురుభీష్మాదిఘనులకృపయిదియనుచున్

క॥ వింతగు నస్త్రంబుల వి క్రాంతిన్ జూపించి రథసుగతుడై పార్థుం
డంతర్ధానుండగు మరి సంతన్ మాన్యుడగు దీర్ఘుడగు సూక్ష్ముడగున్

వ॥ ఇట్లు రణప్రచార శరవిద్యావిలాసంబు జూపించు సమయంబున.

క॥ సానుప్లవుడై రాధా సూనుడు విచ్చేసి పాండుసూను నిరీక్షన్
నానా బాణకళా సం ధానము లేర్పరచె నాసదస్యులు బొగడన్॥

చ॥ ఇరువురు ద్వంద్వయుద్ధమున కీయకొనంగ మహాద్భుతంబు సూ
పరులకొనర్చె కుంభజుని పంపున తత్క్షణ మాకృపుండు భా
స్కరసుతు జేరి నీవు కుల గౌరవ పద్ధతి కీడువతువే

నాసనకటంచు మాన్పుచు । రణంబును పార్థుని పక్షపాతియై॥

వ॥ అదిమొదలు ద్రోణుఁడు కృతమత్సరంబున కర్ణార్జునులుండిరి కౌరవ సత్కారోదారుండై రాధేయుండంగరాజ్య సామ్రాజ్యంబున విఱ్ఱ వీఁగుచుండెనంత.

(గురుభక్తి.)

క॥ ధీరోదాత్తుఁడు పాండుకు । మారుండర్జునుఁడు ధర్మ । మార్గస్ఫురణం
బేరొందెనహర్నిశమున్ । గౌరవముగ గురునియందు గల్గినభక్తిన్॥

క॥ కృత్రిమ విహంగమునొక । ధాత్రీజంబున గురుండు తగఁగల్పించెన్।
ఛాత్రులలో బలుఁడెవఁడని । చిత్రముగ పరీక్షఁజేయు చిత్తము తోడన్॥

క॥ ఉన్నత శాఖాగ్రంబున । నున్నఖగశిరంబుఁజూపి యొకపరిదృష్టిన్ ।
భిన్నంబొనరింపుఁడుమీ । కున్న శరాటోపలాఘవోన్నతిమీరన్॥

వ॥ అని యందఱకి విన్నవించి కనుసన్న నొసఁగి నిలచెనంత,

ఉ॥ అందరుదృష్టిదప్పి వికలాయులు । కృతినుండిరి ధర్మజాదులా
చందమెఱింగి ద్రోణుఁడు ప్రసన్నముఖుండై । కనులావులేదుమీ
కందఱకంచు నర్జునుని యాననమున్ । దిలకించినంతనా
నందమువన్ దదీయచరణంబుల । సోఁకె శరాసనజ్ఞుఁడై॥

క॥ కాండప్రకాండమునచా । యాండజశిరమున్ హరించెనాచార్యుఁడు బ్ర
హ్మాండంబున నీసరిశూ । రుండెటలేఁడనుచు నరున్ శ్లాఘించెన్॥

క॥ ఆతనిగురుభక్తికిఁ బ్రీ । త్యాతిశయత్వమున కాత్మ నలరిమహాస్త్ర
వ్రాతరహస్యములకృపా । న్వితుండై గురుఁడొసంగె విఖ్యాతునకున్॥

చ॥ మఱియొకనాఁడుద్రోణుఁడు । సమగ్రగతిన్ దమశిష్యులెల్లనే
త్రైరజనుదేర జహ్నుసుత । తీరముఁజేరియు మజ్జనాదులన్
వరుసనొనర్చియుండ బలవ । న్మకరంబు గురూరుభాగమున్
బరువడిబట్టి యీడ్వనిలువన్ । బలహీనతనొందువానిగా॥

వ॥ ఆటునిటు మెదలనేరక గురుండు బిక్కముగంబున మృషచేష్టాక్షేపలు నిగుడించుచుండెనంత

క॥ మకరంబునుగాని తానడ । మకరంబునఁ బట్టియీడ్వ మహిమంగలభీ
మకరుండగు ద్రోణుఁడుతే । మకరంబుగ వరిభక్తి మదిగనుటన్నై॥

వ॥ అందఱి నొకపెట్టునంగని యిట్లనియె।

క॥ ముసలితనంబున మొసలను । ముసలివెసన్ బట్టికొనియె మూసపోనియదీ
దెసచుండితి పసజెడిమీ । వినయంబున మసలకింక విడుపించుఁడనన్॥

క॥ ఇమ్మనుగున నమ్మొనలిని । యమ్మున ప్రాణమ్మదియు నమ్మక చెల్లా
మమ్ముంచిగాని పనియని । రిమ్ముగ పార్థుండు దక్క దృపతికుమారుల్॥

ఉ॥ ఆపగ లేసి కోపమున । నాపగనుండిన నక్రజీవముఁ
బాపగ చాప రోపమున । బాపగముల్ గొనియాడ భక్తియుఁ
దోపగ నర్జునుండు వడి । తోపగ వాని వధించురీతిగా
దాపగ నేల నేపణచె దాపగతిన్ గురుడూనకుండగన్॥

వ॥ ఆప్పుడు గ్రాహము విముక్త శీతాంశుబోలి భాగీరథినుండి భారద్వాజుండు విచ్చేసి ప్రమోదభరితుండై పార్థుని కౌగలించుకొనియెను నొక్కనాడు॥

— గురుదక్షిణ. —

క॥ గురుడగు ద్రోణుని కెప్పుడు । పరిచర్యలొనర్చుచుండి భక్తిమెయిన్ సో
దరులన్ గూడియొసంగిన । గురుదక్షిణ కథవినుండు గురుమోదమునన్॥

క॥ ద్రుపదుండను నృపుడతనికి । రిపువగుటయు విపులకపటవృత్తిన్ గురుడ
చ్చపుదక్షిణగైకొనదగు । నెపమున కృపవారిజూచి నేర్పున బలికెన్॥

క॥ తక్షణమున మీరలుగురు । దక్షిణనాకిడవలయు ప్రదక్షిణగతిగా
నక్షీణపదార్థముల నపేక్షించ పరీక్షగా నుపేక్షించితికన్॥

వ॥ అనియాచించిన యాచార్యునకు నారాచకళాప్తులగు రాచకొమరులిట్లనిరి

క॥ పురములొ మీకుండగు కా । పురములొ నవరత్న హేమ పుంఖితవనూ
పురములొ భువనేశ్వరగో । పురములొ దెల్పుము నిజంబు పుణ్యచరిత్రా॥

క॥ సారములై దగినఫలా । హారములో లేక యుగ్ర హారములో మణి
హారములో మృదులవ్యా । హారములలరార దెల్పు మయ్య మహాత్మా॥

క॥ అనవిని ద్రుపదుడనుదురా । త్మునిబట్టియు దెండునన్ను దూషించెను వా
నినిశిక్షించుటయే నా । పనిగురు దక్షిణమొయదియు పదివేలు సుమీ॥

మ॥ మునుమీ చెంతకు రాకమున్న యతనిన్ । మోమాటతో వేడబో
యినవేళన్ మదభీష్ట మీక యెదుటన్ । హీనోక్తులన్ బల్కుచున్
దనగర్వంబున కన్నుగానక ననున్ । ద్వారంబుదాకన్ వెడ
ల్పెను నాకప్పటినుండి చింతగుదిరెన్ । క్షీణించె మేనెంతయున్॥

చ॥ చదివితి నొక్కచోటశత । శాస్త్రపరంపర లాగమంబులన్
మొదలితి నొక్కరూపముగ । మేల్కొని రాత్రిబవళ్లు కళ్లక
శ్రదరకయుంటి మాహితము । నాత్మదలంచక పోయెదుర్మదా
భ్యుదయముగల్గువానికి । హితోచితమార్గము గల్గబోవునే॥

వ॥ గావునవానికిందగు ప్రాయశ్చిత్తంబు గావించినంగాని నాడెందంబానం
దంబునొందదనిన చతురంగంబులు కట్టాయితంబు గావించికొని మును
ముందుగ కౌరవులుజని యతిరథుడగు ద్రుపదుని మార్కొని యుద్ధం
బున పరాభూతులై వచ్చిరంతట భీమార్జునులు భీమప్రాభవంబావహి
ల్లజని తత్సైన్యంబును హల్లకల్లోలంబొనరించి కొదమసింగంబు మద
పుటేనుంగునుబొదవు చందంబున పార్థుండు ద్రుపదుని విరథుంజేసి
పాశంబుల బంధించి ద్రోణుని పదంబుల బడవేసిన యగ్గురుండుపాంచా
లుని పరిహాసించుచు తలనత్తించి చేతబుణుకుచు నతనికిట్లనియెను:

క॥ పేరేనా పాంచాలమ । మారాజులవాగు ధనమదాంధులుమిత్రుల్
జేరినమన్నించనియెడి । వారలుశీవచ్ఛవంబు సరిగనిపించెన్॥

మ॥ ఇకనైనన్ ననుగుర్తుబట్టి రోశాతే । నేలేనా నాబాల్యమి
త్రకుడీతండు మదీయపుత్రికు । మనస్తాపంబు బోజేయపా
లకుయాచించితెకన్నగానక । దురాలాపంబులన్ బల్కెనే
వకుసింగిల్చియు గెంటజేసెనను । గర్వస్ఫూర్తి సంపూర్తిగన్॥

చ॥ అనుచుశిరోజముల్ గొని । నృపాధమునన్నిటు జూడవేలసి
గ్గునతలవంచు టేడనున । కుంగలసత్యత నెంచ రేలసీ
కనుగవకున్ బొరల్ గలిగె । కవ్వడిబాణ బలాంజనంబుచే
తినయనముల్ ప్రకాశిత । యథావిధిగాంచెను లెవ్వో తెల్పుమా॥

వ॥ అనియంతయు గనుంగొన నవమానించి కట్లు విడిపించి వెడలించిన బ్రతు
కు జీవమాయని మానహీనుండై పాంచాలపురంబు ప్రవేశించి మహా
రోషావేశంబున నగ్నినారాధించి సవంబుగావించి.

క॥ నరునివరించెడుపుత్రిని । గురువధించెడుసుపుత్రకుని గాంచెనువా
సురతతిమెన్నగయజ్ఞాం । తర మునవహ్నిప్రసాద ధనసంప్రాప్తిన్॥

వ॥ ఇట్లుద్రుపదుండు ద్రౌపది దృష్టద్యుమ్నులంగాంచె వారుపాంచాలపు
రంబున ప్రబలుచుండిరచ్చట భారద్వాజుండు గురుదక్షిణకు ప్రతీకా
రంబుగ బ్రహ్మశిరోనామ శాస్త్రంబొసంగెదనని పార్థుని కుపదేశించి
యీయస్త్రంబును సామాన్యులపై ప్రయోగించరాదు. దీనిని యుగ
స్త్యంతమ్ని వేళన కిచ్చెనతండు నాకొసంగెనీను నీకొసంగితి నేడు మొద
లు నాతో ప్రతియుద్ధం బొనరింపకుండ రెండవ గురుదక్షిణ నొసంగు
మనిన నందులకతం డంగీకరించెనంత.

— గుణకీర్తన. —

గీ॥ దినదినంబభివృద్ధిగాఁ దేజరిల్లి పాండవులు లక్కయింటిలో నుండిపిదప
చిచ్చులోఁజచ్చిరనువార్త హెచ్చెజగతి ద్రుపదుఁడామాటవిని మహా
దుఃఖమొందె॥

క॥ కర్తలు నన్నిటిలోన ద్వర్తనగలవారుపాండవప్రముఖులు వి
స్ఫూర్తిగనందున నరుగుణ కీర్తన దిగ్దేశములవి కీర్ణంబయ్యెన్॥

వ॥ ద్రుపదుండాత్మగతంబున పరితపించుచు॥

చ॥ శరధులు సత్కృపాకరమ శాతశిలీముఖ లాఘవాప్తిఁదా
శరధులు శాంతభావమున సన్నుతిఁజేయ గిరీశనందనో
రథులుదండదీర్ఘితభుజాయుగ భాగకలంబ శస్త్రభాక్
శరధులు పాండునందనుల సాధ్యులవధ్యులు చచ్చిరక్కటా॥

గీ॥ అందులోనర్జునుండు మహానుభావుఁడర్జునుఁడుగాఁడు కార్తవీర్యార్జునుండు
రాజసుతుఁడై నెనిర్జర రాజసుతుఁడు వీరుఁడనరాదు ప్రతిరఘువీరుఁడరయ॥

సీ॥ తమ్మిరేకుల విందులుజేయఁజాలు కన్నుంగవ నెరపు వీనులకుసాగు
పిదిలిమెఱుంగు నెన్నడురు విజయవాటి, పూపచందు బెడంగుజూపు
హారాయలు, కుంచప్రమాణి కెక్కుడు బుజంబులనడి, నలరారు మెడ
రాచకలిమిగిట్లు, పొల్పునిల్పు వెడల్పు తల్పు పేరురము రా, లచ్చిచిన్నె
లవన్నె పెచ్చుపెరుఁగు॥ గీ॥ మేనశింగార మీను నమ్మానుపడగ
దాలుపానడి నెలనెల జోలిమరువ, జేయుజూపరులకుఁ దానజేయు
డెందు, నంటరాఁ వేలుపాతని నంటుకొనియె॥

క॥ ఎగుభుజములునగు మొగమును మగరాల్ జిగిమించు వెన్నుమచ్చుహాయ
ల్ పొంగ మెగజల్లునుతనువున మగటిమిగలజోదుమిన్నమనువగపశమే

మ॥ గురుభక్తిప్రవణుండు శాత్రవచమూకుంభీంద్రభిన్నాగ్రకే
సరి దేవస్తవనీయ శౌర్యనిధి యోషానవ్యమీనాంకుఁడుర్
శరణన్నన్ రిపుఁగాచువాఁడు బహుశాస్త్రప్రజ్ఞఁగొన్నట్టి భా
స్కరతేజస్కుఁడుదాత్తవర్తనుఁడు నక్కౌంతేయుఁ డెంతోదగున్॥

వ॥ అని తలపోయుచుండె నానాదేశంబులవిధంబున నజునాను గుణకీర్తన
గావించుచు దురటిల్లుచుండి రిట్లుండ నొకనాఁడు పాంచాల ప్రభుండాది
నిజపురోహితుం డిట్లనియె, దేవా! పాండవులు బ్రతికియున్నవారు నేను
పరీక్షింజూచితి ప్రచ్ఛన్నవేషంబుల పరిభ్రమించుచున్నవారు స్వయం

వరంబు చాటించుము వారెచ్చటనున్న విచ్చేసెదరు నమ్ముమనిన ద్రుపదుండొక దృఢకార్ముకంబు నభోమార్గంబున దీగెడు మత్స్యయంత్రంబును దిగువన జలపూరిత భాజనంబును నిర్మించె నంత ప్రతిబింబంబును నిరీక్షించుచేను బాణంబుల మీనంబును దెగటార్చినవానికి మత్కన్యారత్నంబును నొసంగెద నేటికి దెబ్బది యేనవ దినంబున పౌష్యమాసంబున శుక్లపక్షమి యష్టమి రోహిణీయుక్త లగ్నంబున ద్రౌపది స్వయంవర మగునని ప్రకటించె నానాదేశంబులనుండి రాజన్యవర్గంబు రాదొడంగె నేకచక్రపురంబునుండి పాండవులు తద్వార్త వినింగి విచ్చేయుచుండి రద్రిగహనాదు లతిక్రమించుచు.

— బ్రహ్మచర్యము. —

గీ॥ యాగావనంబుననుండి మహానుభావులైన విజయుండు పరమసుజ్ఞానియయ్యు
తానుసాధించినట్టి యుదాత్త బుద్ధి బ్రహ్మచర్యవ్రతంబు నేర్పడవచింతు॥

వ॥ సావధానంబుగ వినుండు.

సీ॥ గండకహర్యక్ష గవయశార్దూల భల్లూకదంతావళ భీకరంబు
కృకవాకకలహంసశుకఘూకబకచక్ర వాకవాయసపక్షిలోకభరము
తాలహింతాల తక్కోల తమాల రసాల లవంగ వృక్షప్రకరము
సంగారవల్లైక రంగద్విహార గంగాతరంగపయఃప్రకాశితలము

గీ॥ నగుమహారణ్య మార్గంబుననుసరించి దివ్యసోమాశ్రవంబను తీర్థమునకు
నేగుచుండిరి పాండవులేవురపుడు కొరవి చేగొని ముందుఫల్గునుడు నడువ

సీ॥ తరుకోటరాగత తోర్ధతవాతనిర్ఘోష, సంకీర్ణమార్గంబులు, కంకపోదల
వాహాహితవరాహ వారశుంభల్లుఠ, తృణకాంబుపూరిత పల్వలముల
భానుభానువ్రజ ప్రసరణాదృశ్యల, పల్లవవల్లీత బహుపథముల
నిర్ఝరవారి మండిత గండపాషాణ, పరివృతి పర్వత ప్రాంతగుహల

గీ॥ యక్షగంధర్వపన్నగాద్యప్సరోవిహారకుంజప్రదేశంబులరసికొనుచు
పాణితలతూణబాణాసబాణధారియైధృతినివచ్చుచుండె నయ్యగ్రజుండు

మత్తకోకిల॥ వారిపాద నినాదముల్ విని వచ్చి ముందర నిల్చి యం
గారవర్ణుడు పార్థుఁ జూచి యగమ్యమైనవనంబు సం
చారమెవ్వరు జేయనోపర సాధ్యదుర్గమ మిందునో
రోరిమానవులార నిల్చరు లుండుచోటుకు వత్తురే॥

మత్తకోకిల॥ మీరు నేచరియించుకోన స మీపమేలజనంగ నం

గారవర్ణుడ నా యరణ్యము / గంగనాది తరంగ నె
వ్వారి కైనను రాథయంబగు / వచ్చి త్రోవ నెపొందు లే
దా రణంబొనరింప రండని / తర్కవాద మొనర్చినన్ ॥

కం॥ అవ్విధిన గంధర్వుని / నివ్విధమునఁ జూచి నవ్వి నెరిఁబవమారీ
ఋవ్వనములు నదినదములు / నెవ్వరి సొమ్ములన జెల్ల నీశ్వరకృతముల్ ॥

ఉ॥ నీవిటునిల్వ కర్తవా? / నేరమొ? మేమిట కేగుదెంచుటల్
నీవచనార్భటంబులకు / నేరక వెన్కకు బోవువారమే!
యేపురముండి భీతినివహింతువొ? / నీవొకరుండవై మముం
ద్రోవను నడ్డమై మదను / తో నెదురించెదు జోదువున్నవే ॥

సీ॥ ఈవనంబునఁగల్గు / పావనహ్రదినీ, పల్వలకుల్యా ప్ర / వాహనిధులు
నీవనంబునఁగల్గు / మృగరాజశుండాల, శరభశంబరమృగ / సంచయంబు
నీవనంబునఁగల్గు / దేవతాసంచార, కుధరకందరమహా / గుహాగణంబు
నీవనంబునఁగల్గు / వృథ్వీరుహానికుంజ, ఫలశలాటు లతాల / వాలపంక్తి

గీ॥ నీయధీనములనఁగ నన్యాయవృత్తి / దైవకల్పితములును యథార్థమరయ
మమ్ము బోనిమ్ము లేదేని మచ్చిలీము / ఖాగ్నిబడి జీవములబాయుదయ్య నీవు ॥

వ॥ అని విజృంభించి నిలచిన యంగారవర్ణుం డంగారతుల్యంబులైన సాయ
కంబుల సవ్యసాచిని నొప్పించిన నరుండు గురుం డిచ్చిన యనలాస్త్రం
బును ప్రయోగించిన వాని రథంబు దగ్ధంబయ్యె నతండిలాతలంబునకు
డిగ్గినఁ బట్టికొని ధర్మజునకు నివేదించిన యగ్గంధర్వుండు గర్వంబు సర్వం
బును విడచి దీనుండై యిట్లనియె.

కం॥ మానవులుగారు మీరెవ / రోనిపుణులు సిద్ధులో కా పరోపకృతిపరులే
నా నేరముల సహింపుడు / భూనాయకులార! శరణుబొందితి గనరే ॥

కం॥ శరణాగత ధర్మపుత్రుడు / కరుణన్ రక్షించెనంత కవ్వడిచే బం
ధురసఖ్యతగొని రణజయ / కరశస్త్రాస్త్రము లొసంగె గంధర్వుడొగిన్ ॥

కం॥ హితమతినతియించి సతీ / యుతముగ గంధర్వనాథుడొయ్యన జనియెన్
చతురోన్నతులగు కుంతీ / సుతులచ్చటనుండి వచ్చుచున్ వనమందున్ ॥

వ॥ అచ్చటచ్చటం గల పుణ్యస్థలంబుల నివసించుచు జననీ సహితంబుగ
పాండవులు మార్గమధ్యంబున ధౌమ్యుని సందర్శించి పురోహితునిగా
నియమించుకొనిరి. బ్రహ్మచర్య ప్రభావంబున పాథుండును భ్రాతలతో
ద్రుపద పురాభిముఖులై వచ్చిన తత్ స్వయంవరాగత రాజలోకంబు

సందడి మెండయ్యె నొక్క కుంభకారక గృహంబున పాదుల విధంబుగ
పరిభ్రమించుచుండి మహానాడు ద్రుపద దాలయంబునకు జని రంతట

—( లక్ష్యసాధనము )—

క॥ పాంచాలవల్లభుం డొనరించె స్వయంవరము నదిపురించియు నటకే
తెంచిన పార్థుని బాణోదంచిత లక్ష్యంబు దెల్పెద విసవలయున్॥

చ॥ దశిళవిదేహ కాంకణ విదర్భ కరూశ పులింద మత్స్య మా
ళవ మళయాళ వంగ కురు లాట మరాట వరాట పౌండ్ర కో
ద్యవనశ కాంధ్ర కొంకణ ముఖాది సుదేశ నివేశ భూతలే
శవరులు వచ్చి నిచ్చిరవశంబగు సైన్యసమేతులై వడిన్॥

వ॥ అప్పుడు పాంచాలప్రభువు పురోహితుని పురస్కరించుకొని రాజలోకంబు
ను పరీక్షించిన పాండవులు లేకున్కి నిరీక్షించుచుండ నంత స్వయం
వర మంటపంబునకు

సీ॥ పొంగారుచదలేటి బంగారుతమ్ములౌ, హారంబుగల్గు రాయంచయనగ
నాకసంబుననుండి యవనిజేనసుధా, కణములీనెడు చంద్రికళయనంగ
జలధులన్నిట మోహ జలధిముంచెడు హాలాహల్, జిలుకాడు మరుని
రాచిల్కయనగ, చంచలాకృతిలేక స్థావరంబుగనిల్చి, వెలుగొందు
మెఱపు తీగె యనంగ॥ గీ॥ దాదిచేయూతగొని వసుధాతలాధి
పతులు భ్రమజెక్కి నివ్వెర పడుచుగనుచు, నుండవచ్చెను మత్తవేదండ
గతులు విపుల వికచాబ్జ దళనేత్రి ద్రుపదపుత్రి॥

వ॥ అంతదుష్టద్యుమ్నుండు వచ్చినరాజలోకంబుతో మీనయంత్రంబునుజూపి

సీ॥ ఇవ్విల్లు మోపెట్టి యేను బాణంబుల, నెవ్వారైనను మింట నివ్వటిల్లు
మీనయంత్రంబును మేదినిగూల్చిన, వాడు క్రాపడకినిక వరుడు సుమ్ము
సక్రమంబుగ మీరు పక్రమించుండన, బంధురనోర్వీర్య సింధులైన
శల చైద్యుల జరాసంధకర్ణులు మహో, ద్ధతి నేసిరియవమున్ ద్దళిలమాత్ర

గీ॥ లక్ష్యమునుదప్పి దైవబలంబు లేక తదితరులు బాణచాపయంత్రముల
జూచి, యనిరి యాదవ సైన్యంబు శౌరియాజ్ఞ లేమి చేమున్న వారొగల్ లేరు రారు

ఉ॥ పాండుకుమారు లేవురిట వచ్చిరి పార్థుడు మీనయంత్రము
పండువిధానగూల్చు వరిపంథి జనంబుల గెల్చు గ్రీష్మ మా
ర్తాండునిరీతి బొల్చు ద్రుపదాత్మజ హస్తము బూని నిల్చు నం
చుం డెదెమొరుంగనట్టుల యదూద్వహుఁ డచ్చట భ్రాతృయుక్తుడై॥

వ॥ ఆసమయంబున,

సీ॥ గ్రహపంక్తినుండి రాఁ గలిగిన బారమై, దాలుపోలేజింకఁ దాలుపోయిన
హరధనుర్భంగఁ గార్యాగతుండైన శ్రీ, రాముఁడో భార్గవ రాముఁడోయన
యవతారపురుషుఁడై యవతరించినమహా, సిద్ధుఁడో సన్మంత్రసిద్ధుఁడోయన
యజ్ఞాంతరోద్ధాతుఁడైన స్వాహావధూ, నాథుఁడో వాణీశనాథుఁడోయన
గీ॥ భూసురవ్యూహమునుండి భాసమానుఁడై సురవ్యూహమునుండి య
రుగుదెంచు, మఘవుఁడో యన పాండవ మధ్యముండు లేచి నిల్చెను
సభికులు జూచి మెచ్చ॥

క॥ ఇతఁడెవఁడో భూదేవా కృతిఁజూను మహానుభావుఁ డితని ముఖకళో
న్నతిఁ జూచిన సామాన్య స్థితిగాదని చూపరులకు చిత్రముదోచెన్॥

చ॥ గురులకు కేల్మొగిడ్చి సభకుఁ గోవిద సంతతికెల్ల మ్రొక్కి శ్రీ
హరిగనులారజూచి తనయాత్మభజించి కడిందిపూర్వమున్
బరిచయమైన విల్లువలెఁ బట్టి శిలీముఖమున్ నిగుడ్చియుం
బరఝషయంత్రమున్ దునిమెఁ బాండవమధ్యము డద్భుతంబుగన్॥

వ॥ ఆసమయంబున,

సీ॥ వలుదగుబ్బలమైనఁ జిలుగుహారంబులు, తళతళయని మెరుంగులు నిగుడ్చ
బలువాలుగల నేలఁగలడాలుకనుదోయి యోరచూపులసోఁగలూరుచుండ
డాబుపోంబట్టుపుట్టంబునో నెమ్మేను, మెరపుచందంబుగాఁ మెరయుచుండ
గజ్జెలందియలు గలఁ గల్లని మ్రోయగా, గంధదంతావళఁ గతులు మెరయ
గీ॥ పుష్పహారంబుచేబూని పుడమివేల్పుఁ వేసమునునున్న నరుమెడ నేసె నౌర
శ్రీరఘూద్వహుపై వేయుసీతపోల్కిఁ యార్యనుతసద్గుణనిధానియాజ్ఞసేని

ఉ॥ కర్ణుఁడుశల్యుఁడప్పుడు వికారమనస్కులునై యిదేమి? వి
స్తీర్ణ బలోగ్రులౌ నృపుల జేరగబిల్చి యపూపసూపముల్
పూర్ణపదార్థముల్ మెసగు భూసురు నల్లునిగాగ్రహించె నా
కర్ణయుడైన యీద్రుపదుఁ ద్రుంతుమటంచు మహోద్భటంబుగన్॥

వ॥ పైబడ విజృంభించిన పాంచాలుండు భయంబున బ్రాహ్మణులకు శరణు
జొచ్చిన యప్పారులు శూరులవలె లేచి యిట్లనిరి.

ఉ॥ కొంకక మీనయంత్రమును గూల్చిన తెల్వులు గావుగాని మీ
బింకము లేఁ? భూసురులఁ భేద్యులటంచు నెరుంగరో కో? మా
వంకకు వత్తురేని బలవన్మరణంబులు సిద్ధమౌను? ని

శృంకతబాసవాల దొరల । శాపము రూపము బాపకుండునే? ॥

వ॥ ఓ ద్రుపదరాజా! యీ వెధవనాగన్నలకు వెఱవకు, వీరల విఫలమనో
రథుల గావింపకున్న యీవిప్రులు వెఱ్ఱులనుకొమ్ము మా చేతిచెంబు
లచే వీరిశిరంబుల చెండాడెద మనవుడు చిరునవ్వున పార్థుండు వారల
నివ్వారించి ధనుర్ధరుండై భీముండున్నత సాలవృక్షంబును పెకికొని సహా
యుండై విజృంభింపగ కర్ణునింగాంచి యట్టహాసంబుగ నిట్లనియె.

క॥ ఈ వారలు ద్రౌపదిగొను । భూపాలురుగారు వారుబోతుతనమున౯
పైపైబడనుంకింతురె । మా పైకటు తేలరారు? మసలక మీరల్ ॥

క॥ రమ్మనుచు నరమ్మునను శ । రమ్ముల గ్రుమ్మింప భీకరమ్ములుగ శరీ
రమ్ములనమ్ముల గ్రుచ్చిన । సొమ్మసిలిరి శల్య సూతసూను ప్రముఖుల్ ॥

వ॥ శల్యుండు భీముని పైబడిన యతం డంతకాకృతివహించి బెసంగి నేలంబడ
వైచిన బలహీనుండై శల్యుండు లేచి యురుకుచు తనమనంబున,

క॥ భీమాస బలమెరిగితి బల । రాముని శౌర్యంబుగంటి రణమున నితడు
ద్ధామత వారినిమీరెను । యేమనుజుడో? సిద్ధపురుషుండేనో తెలియ౯

వ॥ అంత కర్ణుం డర్జునున కోటుబడి యిట్లనియె.

క॥ శూరులు నగుజనుదగ్ని కు । మారుడు విజయుండు మాకు మారుడునన్న౯
బోర౯ గెల్వంగలిగిన । వారలు వారేరి వీడెవండో ఘనుడు౯ ॥

వ॥ అనితలపోసి కర్ణ౯ శల్యులిట్లనిరి.

క॥ భూసురవర్యులు మీవి । ద్యాసంగతి జూచితిమి ముదంబయ్యెను మీ
తో సమరంబేలవృథా । యాసమువహనీయ మూర్తులో మిమ్మెన్న౯ ॥

వ॥ అని కర్ణ శల్యులూరకున్నంత.

క॥ భీమార్జును లుద్ధండ భు । జామితవిక్రమముజూప నంతట నానా
భూమీశులు గుములైతమ । భూములకేగిరి విచారమున మార్గానక౯

—( మాతృవాక్య పరిపాలనము )—

క॥ బాలామణి ద్రౌపది నా । వేళ౯ గొని తల్లికి౯ నివేదించియు తా
నాలోదగనొనరించె కృ । పాళుండై మాతృవాక్య పరిపాలనము౯ ॥

వ॥ అంత భీమునితో ద్రౌపదినిదోడ్కొనిపోయి కుంతికి నమస్కరించి యగ్రజుం
డిట్లనియె. శా॥ తల్లీ నేడు నృపాలయంబున పదార్థంబొండు గైకొంటిమే
ముల్లాసంబున నంత కుంతియది । యేమో భుక్తార్థంబుమీ
రెల్లర్ దప్పక సంగ్రహించుడదియే । దీయన్న పాంచాలిని౯

మాల్లోకంబులబోల్చు మోహినివలెన్ మున్మొందు జూపించినన్॥

ఉ॥ కుంతికి మ్రొక్కి ధర్మజునకున్ బ్రణమిల్లి సమీపమందు రా
ద్ధాంతము చేతనిల్వబడె ద్రౌపది పార్థునిచేత నంత వృ
త్తాంతమెఱింగి పాండుసతి యప్పుడె దీర్ఘసుమంగలీ భవా
కాంతయటంచు బల్కితన కౌగిటజేర్చి బహూకరించియున్॥

క॥ కుంతి తనెంతయొ వింతగ స్వాంతమున విచారముడిగి సంతసమున య
క్కాంతామణి తమపాలిటి చింతామణి యనుచు పార్థుజేరిట్లనియెన్॥

మ॥ కొడుకా! భిక్షయనంగ వేరొకటి నాకున్ దోచె నిక్కంబు దె
చ్చెదు పక్వాన్నమటన్న భ్రాంతియె యి నాచిత్తానుకూలంబుగా
నడువన్ జూతురు తప్పరెన్నటికి నానందంబుగా నేవురీ
పడతిన్ మీరు వివాహమాడుడి శుభాప్తశ్రీలు చెన్నొందెడున్॥

వ॥ అనిన యర్జునుండు సభక్తి యుక్తి నిట్లనియె

క॥ సతికేవురు పతులుండిన క్షితి గర్హణమైనసేత క్షేమంబగునే
మతిమంతుడగ్రజుడు యమసుతుడుండెను తాగ్రహింప శ్రుతిధర్మమగున్

క॥ అనినన్ ధర్మజుడిట్లను ననుజా! నీశక్తిచే ప్రియాసపడి గ్రహిం
చిన సాధ్వి గ్రహించుట పనియగునే నీవెపొందు వైవాహికమున్॥

క॥ అంతన్ బలరాముడు శ్రీ కాంతుడు వ్యాసుండు వచ్చికలసిరి యావృ
త్తాంతంబాతనెఱింగియు సంతసమున తల్లియాజ్ఞ సల్పుడిశుభమా॥

వ॥ అప పూర్వజన్మ కథనంబును పంచేంద్రోపాఖ్యానం బెఱింగించిన సవ్వ
చనప్రకార మాచరింతుమని సంతసిల్లిరంత ద్రుపదుండు వారల నిజా
గారంబునకు తోడ్తెచ్చి కౌంతేయులని యెఱింగి వివ్వచ్చునకు వివా
హంబు జేయసమకట్టిన సవ్యసాచి యిట్లనియె.

ఉ॥ అన్నలుతమ్ములున్ నలువు రచ్చటనుండగ నేవరించగా
జన్నెనృపాల మాజనని శాసనమున్ విడనాడమంచుతా
మున్నవిధంబుదెల్ప నృపు డొప్పగ నెల్లియొనర్చెవారికిన్
కన్నెను మంత్రపూతముగ గౌరవలీల మహోన్నతంబుగన్॥

క॥ పదిమంది యానవగ నర పదిమగల వరించికోర్కె పులియించగ ద్రౌ
పది పుట్టినింట పతులకు పదిలంబుగ సేవలిడుచు భక్తిగనుండెన్॥

—( నియమ పాలనము )—

క॥ మరినింద్రప్రసపురాంతరమున నివసించి దర్మనందననాజ్ఞన్

జరియించెను పార్థుఁడు కుం। దరముగ తన్నియమపాలనము వినిపింతున్

మ॥ ధృతరాష్ట్రక్షితినాథు । డంచిత కృపాధీనాత్ముడై జాహ్నవీ
సుతకుంభోద్భవ బోధి । తాత్ముఁడయి రాజుల్ మెచ్చ నప్పాండు రా
ద్సుతులన్ బిల్చి తదర్థ రా । జ్యమిడి యిచ్చో మీర లేవుర్ముహో
న్నతిసౌఖ్యంబుగ నుండుడంచు । నిడె నిం(ద)ప్రస్థపూరగ్రమున్॥

క॥ భీమార్జునుల భుజాబల। సామర్థ్యము మాద్రిసుతుల సాయముచేతన్
భూమిని నేలుచునుండెను । ధీమణి ధర్మాత్మజుం డతిప్రతిభదగన్॥

వ॥ పాండవులు ద్రౌపది నొక్కొక్క రొక వత్సరంబు గూడియుండుట
వ్యతిరేకంబయిన భూప్రదక్షిణంబు జేయుట నారదునిచే నియమింపఁబడిరి
వ్విధంబుగనుండ నొక బ్రాహ్మణుండు తస్కరులచే గోవులనుగోలుపోయి
ఘోరున దుఃఖించుచు దిక్కుమాలి యార్తరక్షాపరుండగు నర్జునుని జేరి
యిట్లనియె ఉ॥ భూవర తస్కరాధములు । మోరకులై ననునొంటిజూచి నా
గోవులబట్టికొంచు నిది । గో జనుచుండిరి వారినొంచి నా
గోవులనాకొసంగు మను । కూలుడ వాశ్రిత పాలికెల్లనీ
వేవిధనైన నా మనుపవే । శరణార్థిని నన్నుజూడవే॥

వ॥ అని ప్రతిమాలిన క్షితిదేవునకు శతమఖసుతుం డిట్లనియె.

ఉ॥ భూసురశేఖరా నగల । బొందకు తస్కరులెందరున్న వీ
తాసుల జేసెదన్ నిమిషమందు । భయంబును దక్కియుండు సం
త్రాస శిలీముఖచ్ఛటల । దర్పమడంతు నిమేషమందు నీ
కోసము నెంతకైన నను । కూలతనుండెద నిక్కవంబుగన్॥

వ॥ అనియతనిని నివ్వారించి తనమనంబున నిట్లని వితర్కించె నిర్విఘ్నంబుగ.

గీ॥ భీముడేవేళజని కురు । వీరవరుల జంపునోయని సంశయస్వాంతుడగుచు
నాయుధాగారముఖమునయమసుతుండు। కృష్ణతోగూడి వసియించె నటులఁబోదు

ఉ॥ పోయితినేని మానియమ । మున్ వృథయౌనొకో భూప్రదక్షిణల్
జేయుట దప్పకుండునకద । శీతరుకంఠక యోగమయ్యె నా
జేయువిచారమేది యెటు । జేసిన రెండువిధాల ముప్పగా
నీయువనీసురోత్తముని । నేర్పున గోవులనిచ్చి తోలెదన్॥

వ॥ అని యోచించికొని యాయుధనికేతనంబునకుజని వలయు సాధనంబుల
గొని దస్యులదండించి గోవుల భూదేవునికి సమర్పించి జరుగుకథ నెరిం
గించి యిట్లనియె.

ఉ॥ పూర్వజ నాకనుజ్ఞనిడు ♦ భూమిప్రదక్షిణ జేయఁబోయెదన్
సర్వమయుండు దేవముని ♦ పల్కినశాసన మీఱవెరుంగవే
పూర్వకృతప్రతిజ్ఞ మనమున్ ♦ విడదీయుటగాదు జూచెదన్
పూర్వర దుర్గమాద్రి ♦ వనముల్ మరి పుణ్యనదీ నదంబులన్॥

వ॥ ధర్మజుండా మాటలువిని సవ్యసాచి వియోగంబునకు భరింపలేమికి
ననుకూలవచనంబుల తమ్ముని లోబరచుకొన నిట్లనియె.

గీ॥ పుడమివేల్పునకుపకారకి మునువహించి జేయుపనికల్మషంబన జెల్లునొక్కో
జ్యేష్ఠునకునొప్పదెపుడు కనిష్ఠగనక ♦ నిష్ఠునకునొప్పు జేష్ఠుమందిరముగనగ

వ॥ అనిన యర్జునుండిట్లనియె

శా॥ నాకున్ మంచిదటంచు ♦ దోచదిపు డన్నా నన్ను పేక్షించకీ
లోకుల్ మెత్తురె బోవకున్న ♦ మనకీలోపంబురానేల నే
నీకార్యంబు త్యజింపజాల ♦ నొకయేడీ భూతలంబంతయున్
సాకల్యంబుగ సంచరించెదను ♦ నానాపుణ్యతీర్థంబులన్॥

క॥ ధర్మాధర్మ విచక్షణ ♦ కర్మాధీనులము మనము గనగా యీ దు
ష్కర్ములలోనై నిలచిన ♦ పేర్మిన్ విడనాడిప్రజలు వెర్రులటనరే॥

వ॥ అనిన ధర్మజుండు తమ్ముని ప్రతిజ్ఞకు ధర్మసందేశంబునకు శంకించి యను
జ్ఞ నొసంగిన ధనుర్బాణ యుక్తుండై భూప్రదక్షిణ దీక్ష వహించి
వెడలె నంత.

( భూప్రదక్షిణము )

క॥ అక్షీణపరాక్రమ హా ♦ ర్యక్షుడు దక్షుండు పావకాక్షపయోజా
తాక్షపదధ్యానకలో ♦ ధ్యక్షుండై జేసె భూప్రదక్షిణ నరుడున్

ఉ॥ జూచెను వారణాశి గయ ♦ జూచె ప్రయాగ నయోధ్య మాయ సిం
హాచల యాదశైల వృష ♦ భాచల కాంచియవంతి రంగ శే
షాచల మంగళాచల సు ♦ రాచల ధర్మపురీ నృసింహా భ
ద్రాచల కాళహస్తి తుహి ♦ నాచల పూర్వదిశాచలంబులన్॥

గీ॥ గంగ గౌతమి కావేరి తుంగభద్ర ♦ సరయుజర్మణ్వతీ నజ చంద్రభాగ
శుక్తిమతిభీమనది జహ్నుసుతపినాకి ♦ ముఖ్యనదులను సేవించె భూభుజుండు

గీ॥ సకలమునుజూచి యాసవ్యసాచి గంగ ♦ వీచిజలమూడగను జూచి లేచి
శిరము నూచి చేజూచివేడ రసోచితముగ ♦ దోచి దగగూడిరట శిగ్గు
ద్రోచినోచీ॥

క॥ కోకిలకీరకసత్తగఁ వారికి సుఖమడర రతుల వర్తించగ యా
నారికి సుతుఁడొదవెను మదన్ నారికి గోకిలనిగల్గు నాగుహుఁడనఁగన్॥

క॥ కౌంతేయునిచేఁగాంచిన । సంతానములూచి కమరసంతానముగా
వింతన్ వర్తించెనిలా । వంతుండనుపేర కీర్తి వంతుండగుచున్॥

వ॥ అర్జునుం డచ్చటనుండి వచ్చుచుండ మణిపురాధీశ్వరుండగు చిత్రవాహ
నుండెదిరింగి విజయుని నెదుర్కొని నిజ పురంబునకు దోడుకొనివచ్చి
సత్కరించి యిట్లనియె.

చ॥ జనవర ముక్ మదీయకులఁ సంభవుఁడైన ప్రభాకరుండు సం
దనులును లేక శంకరున్ పదంబుల గూర్చి తపంబుజేయ నా
తనితపమెల్ల మెచ్చి గిరిఁ ధాముఁడు పుత్రునొసంగియింక ని
ట్లనెయిటనుండి నీదగుకులంబ్ బునకొక్కఁడొకండె చూపడున్॥

వ॥ అనివరంబొసంగె నటనుండి యొక్కఁడొకఁడె యుదయించుచుండె నా
కర్మవశంబున నేటికి నాకొక కూతురె జన్మించె నకన్నియను పరిగ్ర
హించి దౌహిత్ర లాభంబు నొసంగవే యని ప్రార్థించిన పార్థుండును
పరమహర్షంబున,

క॥ చిత్రాశ్వుని పుత్రికయగు చిత్రాంగద నపుడు పెండ్లిజేకొని జయుఁడౌ
పుత్రునిగాంచెనుతత్కాల । జైత్రేయుని బభ్రువాహనాఖ్యున్ ముఖ్యున్

వ॥ అచ్చటనుండి యర్జునుండు సౌభద్రంబను పుణ్యతీర్థంబున కరుదెంచి
గ్రుంకయత్నించుచుండ నత్తీరనివాసులగు తాపసులిట్లనిరి.

క॥ నూరేండ్లనుండి యిచ్చటన్ కూరగ్రాహములునిలచి గ్రుంకినమాత్రన్
నోరప్పళించి మ్రింగుచఁ రారమణా యందుజేర రాదెవ్వరికిన్॥

వ॥ సౌభద్ర పౌలోమ కారంధమ ప్రసన్న భారద్వాజంబులను పంచతీర్థం
బులివి మొసళ్లుండుటచే సాధుజన వర్జితంబులై యున్నయవి నీ నెరుంగక
పోనున్నాఁడవు ప్రాణహానియనిన పార్థుండిట్లనియె.

గీ॥ సర్వతీర్థసేవార్థినై జగతిదిరుగ । వచ్చి యీతీర్థములగ్రుంక బడకయున్న
ప్రాభవముగాదటంచులోపలికిడిగి యొకనట్టియెడనొక్కనక్రంబుబట్టికొనియె

క॥ వీరాగ్రేసరుఁడాయుధఁ ధౌరేయుఁడు సాహసుం డుదాత్తబలమహో
దారుండైననక్రంబునుఁ తీరంబునకీగసివైచె ధీరత్వమునన్॥

వ॥ ఆనక్రంబు కాంతాకారంబుగ కౌంతేయునిచెంతనిలచిన వింతపడి వివ్వ
చ్చుండు నీవిట్లగుటకు కారణంబేమనిన? నది నమస్కరించి దేవా వర్గ

యను దేవకన్యకను సౌరభేయి, సమీచియు, బుద్బుదయు, లతయును, నను నలువురు నాచెలికత్తియలై తీర్థంబుల నావలె నక్రంబులై యున్న వారివి యొక్క మునిశాపంబునం జేసి యీరూపంబులు వచ్చె నివి యర్జునుని కరస్పర్శనంబున నూరేండ్లకు శాపవిముక్తి యగునని నారదుండు మాకు మొరాలకించి యనుగ్రహించె నీవే నిక్కంబుగ నర్జునుండవనినుతించిన వారిని తద్విధంబొనరించి తదాశీర్వాద లబ్ధుండై ప్రభాసతీర్థంబున కుంజనియె నచ్చటికి ద్వారక చేరువయగుటం జేసి పోదలంచుచుండె నంత

( సౌందర్యము )

క॥ సుందరవంతుండని గో । విందునిచెలియలు సుభద్ర వివ్వచ్చునిపై
డెందమునిడి యానందము । బొందుచు నాతనివివాహ మూనదలంచెన్

సీ॥ భద్రేభయాన సుభద్ర దేవకిసుత, శ్రీకృష్ణుసోదరి । లోకమాన్య
మేనత్తయగుకుంతి సూనుడర్జునుడు గో, ర్వెభవుడాపీరుని । పెండ్లియాడ
కాంక్షించుచుండె నక్రాంతకష్టంబుగా, వనజనేత్రుండిష్ట । మునువహించె
రారాజుపైబల । రాముడత్యంత ప్రీతి, మానుడై యొకటికియు । జూచెనంత

గీ॥ నాసుభద్రార్జునులకు నుల్లాసముగ పరస్పరస్నేహ మొదవుచురహిజెలగిరి
గానియుకార్యమగుటకుకష్టము న్యోనకియుకొరకర్జును డుద్వారకకువచ్చె

వ॥ అంత నచ్చట సుభద్ర పార్థునిందలంచి తనమనంబున నిట్లువితర్కించె.

గీ॥ భూప్రదక్షిణమునకునుబోయె నర్జు । నుండటంచును జనులాడుచుండిరకట
ననుపరించుటకిందు వచ్చునో గాదో । ధాత నాఫాలవ్రాసినగీతయెట్లో

క॥ తూనికజేయగ పార్థుని । తోనిక సోయగమునందు తుల్యుడెవడగున్
పూనికతో నను నిర్దయ । మూని కటాక్షించు రేని మానికముగదా॥

లయవిభాతి॥ సుందరమునందు నరవిందశరుసందునిపురందరుని నందనునియా
దములజిందున్, కుందముల బృందముల కుందగిన చందముల
నందగ దరు దంతముల పొందుదనరున్ గో, విందుని మరందికిని
సందెడుకురుల్ జిగిఘనందు మొగ మొందు కురువింద మధరం
బున్, చిందము గళంబు ధృతి మందరము బందుగుల కందరికి
విందులిడు నెందునన పొందున్॥

సీ॥ మొలకనవ్వులుకు నె । మ్మోము తామరలు, నేత్రములు సౌభాగ్య । 
పాత్రములు కిరవు, వేల్పుదారాలకీ । విజెలంగు తేజము. మాబ్బుం
దొరయు వెన్ను । మచ్చుహంసయలు, నూబూ పునదుము దుష్క । నును

చెక్కులతళుక్కు, నిక్కుమీసలకు వన్నియలు జేర్పు, గుఱిబారసిడనిపై
కృరశాలతూపుగ, ములపొదుల్గల భుజములపొడవును॥ గీ॥ పేరుర
ము గల్మికాపు గంభీరనాభి సింహసంహననంబును సింహమధ్య మును
గనుంగొన భూరివిభ్రమము గొల్పు నాథుఁడొప్పు సరియూనె యేనరుండు

క॥ నలరాజును నలరాజును నలరాజునుమించు రూపునంగనుగొన బ
ల్లలరాజు శేముషింగా మాలరాజు సమగ్ర తేజమున గణుతింపన్॥

క॥ ఒకమాటన యదిసుధపా నకమా కొంగుముడిగల కనకమా బలమెం
చకుమూరు మీరునారా చకుమూరునిబోల రేదెసకు జనిగనినన్॥

క॥ అనిచనువును కనికరమును మనమున బెనగొనగ యింతి మరులొందుచు శి
గ్గుననెవరికి తెల్పక యుండెను నిండినతమి నరుంగణించుచు నాత్మన్॥

( ఆశ్వాసాంతము. )

సుగంధి॥ పూసుకూరువంశచంద్ర। పోషితార్థిభూజనా, వాసుదేవపాదయుగ్మ।
వారిజాతపూజనా, వాసరాదివాసరాంత। వర్ధితార్యభోజనా, భాస
మాన చంద్రచంద్ర। భవ్యకీర్తిభాజనా॥

క॥ వెంగారాయాధిప నర పుంగవ యారుట్లగోత్ర బుచ్చన్న నృపా
లాంగజ శృంగారాంగా రంగారాయాఖ్య చొక్కరాయాధిఖ్యా॥

క॥ మేధాత్మక యోధసమా రాధిత మాధవపదాబ్జ రాజేశ్వరరా
యాధర ధీరాత్మజగన్నాధా రాయాకవిప్రధానగణేశా॥

గద్య:

ఇది లక్ష్మీనృసింహ దేవతాప్రసాదలబ్ధ కవితా విచిత్ర ఆత్రేయస గోత్ర
పవిత్ర జగ్గమరాజ పౌత్ర సుందరరాజాగ్రపుత్రాంబటి వంశాబ్ధిరాజ
లక్ష్మీనృసింహరాజప్రణీతంబైన యజ్ఞనాభ్యుదయ
నామాంతర విజయవిజయంబునందు
ప్రథమాశ్వాసము
సమాప్తి.



శ్రీశుభమస్తు

# విజయవిజయము

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీసత్కీర్తిత బుచ్చన్న దత్త । రావర ధర్మవరధామ రాధాసుత దా
నావిత కవిపండితజన । పావన రామరాయభూప స్థిరగుణదీపా॥

వ॥ అవధరింపుము శౌనకాదులకు సూతుండిట్లనియె నట్లు సుభద్ర నపాకీర
సూరుం దలంచుచుండ.

క॥ యతివేషంబున పార్థుడు । నతిరయమున ద్వారకాపురాభిముఖుండై
కుతుకంబున వచ్చుచు శ్రీ । పతినాత్మ భజించె భక్తిభావము చేతన్॥

వ॥ అంత కృష్ణుండు ప్రత్యక్షుండైన యర్జునుండు నమస్కరించి యుభయ
కుశలప్రశంసల ప్రొద్దుడపినంత కృష్ణుండతని యభిప్రాయంబు నను
సరించి సుభద్ర విషయంబునుగురించి యిట్లనియె.

ఉ॥ రాముఁడు దక్క నందరికి । గాఁకకులాభరణంబ నీకు న
క్కోమలి నీయ నెంచితిమి । కోరిక లీరిక లెత్త వేగితిన్
సేమము జెందెదో యతనిచేత । పరాభవ మొందెదో సము
ద్దామపరాక్రమస్ఫురిత । ధాముఁడు విక్రమభీము డెన్నగన్॥

క॥ రైవతకాద్రియు నెల్లియు । గోవిందోత్సవము జేయఁ బూనితి మీవా
త్రోవల వెలుఁగు యతివై । రేవతివల్లభుని యతుల ప్రేమించుకదున్॥

క॥ శ్రీరాముఁడు నిను బిల్చు । గారామలరంగ నాదు భోజనాదులకు సుభ
ద్రా రాజ్ఞానుశిష్యోస్మి హారిరామా! యనుచునుండ నీనీచటన్

వ॥ వర్షాకాలంబు గడుపు మీ సద్మయంబు వసించెదననుము సమయం
బెరింగి సకియకు లోబడుచున్నామని యుపదేశించి పనిచిన, సవ్యసాచి
సంతసించి సన్యాసియై సంచరించుచుండె రైవతక మహోత్సవంబునకై
ద్వారకాపురంబున,

మ॥ మదఘీంకార కరీంద్రసంఘములు స । ద్యోగ్యాయువేగాశ్వముల్
విదితప్రాభవ వీరసైనికులు । సర్వోదేవ బృందంబు నా
యదుభోజాంధక వృష్ణినాయకులు । భూపాలంకృతాకారులై
సుదతుల్ బాలుర వృద్ధులుం జని రథీసుల్ దానదాసీజనుల్॥

చ॥ ఘృణగల రామపాలకుఁడు । రేవతితోఁ జనుదెంచె శౌరి రు

వ॥ అన్నా! నీయుపశంబున కేమి జేసెదనని బలరాముం డిట్లనియె, కృష్ణా! నీవెంత మూర్ఖభావంబున నాయనకు నొప్పించితివి.

క॥ యతులు జితేంద్రియులు తప, స్స్థితు లంతర్ముఖులు మంచిసేతలచే స న్నుతులొందెడువారలు దుర్వృత్తములఁగొనదెప్పు డెంతమాటయుకుందా

వ॥ అని హాసనిక్షేపించి రైవత దేవతోత్సవంబు గావించి ద్వారావతిం జేరి యభిరామారామ కుటీరంబునకు నయ్యతీశ్వరుని దోడ్కొనివచ్చి, సపర్యలొనర్ప సుభద్రనుజూపి యిట్లనియె.

మ॥ ఇది మాసోదరి యౌవనాంగి యతులం జేరీతి వర్తించు న య్యదిగుర్తించదు మద్దునం బెరఁగు కన్యారత్నమెబ్బంగి మీ పదసేవారతి సంచరించునొ భవద్భావంబు గుర్తించను న్నధియావాప్తి వచించి మీపనులు పుణ్యస్వాంత గైకొందగున్॥

వ॥ అని యొడంబరచిన ప్రతివచనంబు భయభక్తులు వెనంగొన సుభద్రాదేవి యాచార ప్రచారంబున,

క॥ పూజా పదార్థములు మఱి భోజనవస్తువ్రజలు పూటపూటకు క్రొత్తన్ గా జేసి యిచ్చుతాన వ్యాజమునం బలర భక్తి వైఖరిదోపన్॥

వ॥ ఇట్లు నవ్వనాంతరంబున కాంతా సపర్యలొందుచు కౌంతేయుండు తన స్వాంతంబున నయ్యింతిని వర్ణింపం దొడంగె నట్లు,

సీ॥ సోయగంబుల బంతి సొగసున చామంతి, మేల్కడా నిబవంతి మేని కాంతి, తళుకు మించెడు కండ్లు కలువల చెలిమిండ్లు, పాలు పొందు పాలిండ్లు పూలచెండ్లు, యలరు విల్తుని మావి పలుకు పిల్లనగ్రోవి, పిగుదులు దీవి నా భిసడ బావి, చెక్కులు ఫలద్దాలు జిగిపండ్లు ముత్యాలు, పొలతి వీనులడాలు బుబ్బడాలు॥ గీ॥ వేడుకల గుల్ల చూపుల లేడిపిల్ల, గానములకు పట్టుకొమ్మ కుందనపు బొమ్మ, యీసుభద్ర సువర్ణక, శాసముద్ర నేనికెప్పుడు గైకొందు జీవిపొందు॥

లయవిభాతి॥ తమ్ములు పదములు చలమ్ముల చలమ్ములు కచమ్ములళులెమ్మెయు సమమ్ము మెరుపౌరా । కమ్మవిలు కాని ప్రదరమ్ములన చూపులు కరమ్ములరు తూండ్ల నజుజమ్ములు జెలంగున్ । బొమ్మలు ధనుః ఖలజమ్ము గళమెన్నగ దరమ్మన ధరమ్ము మణిఘమ్ము గనగన్ సా మ్యమ్ము వినుమ్ము శ్రీమ్మకుల కొమ్మలకు చిత్తరువు బొమ్మమొకొ నన్నిన సూనము నఃశమ్మున్॥

వ॥ ఇట్లు లోలో గణించుచు దినం బొక యుగంబుగా గడుపుచు పైకి తన
పనులు నిగమించుటకై యువ్వనంబున వనితలిట్లనియె.

సీ॥ కొమ్మ యీకొమ్మ యా కిమ్మ నాకనిపల్కు, నాభిస్థలంబు చ నవ
నుగన వారియాదారిగా వాటెదమ్మనిపల్కు, తొడలంటనడలకుపింప
ముడినువనగ, బాలగోపాల యీ వేళ పూజ దెమ్మనుచు, కన్నుగోయుబ
మోముకు గనుగొనంగ, కలికి సీతపలుకు చెక్కుల కెనగ టుమ్ము,
టని సమీపమునఁగడ నియమింప॥ గీ॥ సుమనుమెక్కుచు సుమము
గా విపులకితలు తపము జేయుచు నపరిమితతపము, నొంచుచును
గుందుచును తమి జెందుచును, భద్రకై వేచియుండెను శాంత్రివంచ॥

వ॥ ఇట్లు తెరమకాలంబుగా సంచరించుచు నొకనాడు తవాకార సౌష్ఠ
వంబు లక్షించి మనంబున

క॥ దొరకెను సందియమును గ్రంథకోనెన్ యది జూడగా నిక్కను సం
కల్పించిన నందను చంద్రముఖి సుందరాకారంబు నితఁ జూడగ నుపడెన్॥

ఉ॥ బాహువు దీర్ఘమున్ జఘనభాగ విశాలము సూక్ష్మమధ్యమున్
బాహు యుగాంతరస్థలము నవ్యయుగంబు గళత్రిపారమున్
దేహవిలాస సౌష్ఠవము దేశికనుంగొన నొక్కరూపు సం
దేహము లేదుగాని నృప తత్త్వము నాని యతీశ్వరుండనునే॥

ఉ॥ ధీచతురుండు పార్థుడు నటిత్వరితంబుగ నంపినంత యా
త్రాచరణికలిద్దై జనక రాజుకు పోకడలోన సీతనున్
జూచెనొ? లేదొకో? యడిగి జూచెద పుణ్యనదీనదంబులన్
జూచినవాడు గల్గదె గనుంగొన మానిసిబోలి మానిసుల్॥

వ॥ అనసమీపించి యతివ యతనికిట్లనియె

శా॥ చంద్రగాండంబు మిత్తు దంబరములపై సంచారమున్ జేయుచో
సౌందర్యస్వామిన్ ధరంగనుంగొనెదు నా చందాన సర్వంబు మా
నింపాపి బారలెరుంగి యుండురుగదా యెందేవగా బోవ దీ
రంద్రప్రస్ఫురితంబు నెవ్వడైనన్ వీక్షించియున్నారొకో॥

గీ॥ అందువారవు లను జూచి యుండురయ్య, నను నెరుంగుదురయ్య వ
త్సరము భూప్రదక్షిణము జేయనేగెను పార్థుడసిలెనా, యనఘ మెటు
వచ్చినన వివాహంబు గొనునో॥

శా॥ శ్రీకరంబులు పీనులుంగనగ రాజీవంబు లక్షిద్వయం

శాకారంబు జయంతునిం గెలుచు । సౌరామోము చందంబునా
రాకాచంద్రుని దట్టు ధైర్యము । ధరాధ్రంబౌను చేదమ్ములున్
మోకాల్మీదికి నొప్పనాన్నృపతికో । పుణ్యాత్మలీక్షించితే ॥

వ॥ మాంత్రప్రశ్నభావంబున నాయడిగిన యుత్తరంబులకు ఫలప్రాప్తి సెల్పవే యడిగినంత,

ఉ॥ నావుడు నత్తపస్వి చిరు । నవ్వున నిట్లను పార్థుఁ డిప్పు డో
దేవి యిటుల్ వసించె వెను । దీయక నిన్ను పరిగ్రహించు నీ
వైవరియించియున్న పరి । వారము నచ్చు నవారి దాన ని
యూపనమున్ పాలాయల గులుకు । సంగవిలాసము జూచి పీడునే ।

ఉ॥ ఇంచుక సేపు నిల్వుమిటు । కిప్పుడె నామహిమా ప్రిచేత ర
ప్పించెద వాని యూపుగని । పించెద నీవసికంబు నన్ను పూ
జించిన దానికిన్ ఫలము । చేకురు సత్య మటంచు నవ్వి మో
హించితి నిన్ను పార్థుఁడ । గ్రహించుము సిగ్గు త్యజించుమంగనా ।

చ॥ అనికరమూని పట్టినల । తాంగికి పుట్టెను బుట్టె లజ్జ యే
మనుటకు నోరు రాక తనువా । యని చేకి డడీసి లేచి యే
గెను చెమటల్ మొయింగలుగ । కీరపికధ్వను లొప్పె నంతలో
కనవిలు కాడు పైకొనియె । నాతికి నిర్జర నాథసూతికిన్ ॥

—( వివాహము. )—

క॥ బలరాముఁడు లేనివేడన్ । బలసూదనసూతి తా సుభద్రను గొని సే
నలు నడ్డగించి వచ్చిన । గెలచ నెన్ పురికి కేగెడి కృష్ణుని కరణిన్ ॥

వ॥ అట్లు సుభద్ర యాంతిపురంబునకు జనిన శ్రీకాంతుండు సాంతంబావృ
త్తాంతంబు తన కాంతలకెరింగించి యేకాంతంబుగ కౌంతేయునకు వివా
హంబొనరించుడని బలరామాదులతో పరమేశ్వర పూజావిధాన వ్యాజం
బున నంతద్వీపంబున కేగిన తి దేవకీవసుదేవులను మతించి సుభద్రా
ర్జునులకు రహస్యంబుగా వివాహంబొనరించితోలించిన రథారూఢుం
డై యేగుచుండ యాదవబలంబులు మూగి నట్టడించిన ధనుఃపాణియై
యందరిని చికాకొనరించెనంత.

క॥ ఆవృత్తాంతము విని బల । దేవుఁడు విప్పుడె పట్టింతు నటంచున్
బోవన్ వెన్నుఁడప్పుడ । న్నాపలదని యడ్డగించె నయవాక్యములన్ ॥

శా॥ అన్నా తప్పు పనేమి గాదు । మనయింటల్లుండు తానమ్మ పి

వ॥ చిరునగవున చెలులు జనియంత కౌంతేయుండు కాంతాకరంబు లాగికొని సంతసంబున నిట్లనియె.

ఉ॥ నీయధరోష్ఠవామృతము నీయుపగూహన దోఃప్రచారముల్
నీయుచితానులాపములు నీమృదుగాంచిత గండచుంబనో
పాయములీడు కుందగిన యంతటిసౌఖ్యము నీక చేష్టితం
బీయెడ నాకు లబ్ధమగు హేతువజూపు వధూ శిరోమణీ॥

వ॥ అని గాఢాలింగనంబొనరించి పరస్పర మోహంబున,

సీ॥ పలునొక్కులొలసి చెం పలగొట్లు సూచింప, జేయుచు చుంబనాల్
జేసి జేసి, దొండపండును బోలి యున్నదు వాతెర జున్ను, కూర్మినరొక్కుల
గోరిలి గోరిలి, చనుకపూసలపయిల చిక్కులొందగ గాట, మైనకౌగిం
తల నానియాని, పెను తాళ్ళచులవిధంబు బెనుగులాడుచు నఁ, రస్పర
సురతంబులు పలిపిపలిపి, కూర్మకుక్కుటగోముఖ కుంభయాన,
శుంభదంగజ రణమున సొక్కి సొక్కి, యుక్కనక్కన జేర్పుచు
నక్కజము గ, నెక్కగతులివిధంబు పెంపెక్కి రపుడు॥

గీ॥ విజయుడు సుభద్రియాగతి విజయుపత్నిదముగ సుఖించు వేలమూదము
నఁ బ్రబలెన్న శుభదినంబున గజయానజయాన కూల గర్భము
దాల్చె॥

గీ॥ కేలుకలాని తేపచెక్కిళ్ళు తెల్ల బారకౌనుబ్బగుబ్బలు బలువుదనర,
నొసలుజడలిక బడ నడజము గాంచ మంటెరు దినంట చేకూరె మగువ
కపుడు॥

క॥ సీమంతినీమణికిదగు సీమంతముఁ జేసిరపుడు స్థిరశౌర్యకళా,
శ్రీమంతుడు ధీమంతుడు శ్రీమంతుడు కొడుకుగల్గు చెలువారయనుచున్॥

క॥ ఇనశశికుజరాహువులు యనిమిషగురుశుక్రశని బుధాఖ్యులును చం
బునశుభదృష్టిగనుండగ మనకిజనుండగుడు నొక కుమారుఁడుగల్గెన్

వ॥ అక్కుమారరత్నంబునకు నభిధానంబభిమన్యుండని నియమించిరి పాండ
వపాంచాల యాదవులానందించిరి దినదిన ప్రవర్ధమానుండై ద్రోణునకు
ప్రశిష్యుండై నెగడె నిట్లు సుభద్రార్జునులు ద్వారకాపురంబున కాపు
రంబై యుండ నొకప్పుడు,

—( పరాక్రమము. )—

క॥ దేవేంద్రాదుల గెలిచియు పావకునకజీర్ణరోగ బాదహరించెన్

శ్రీవరునిగూడిజూపెను । ప్రావీణ్యంబర్జునుని పరాక్రమమెంతయున్ ॥

వ॥ కృష్ణార్జునులొకనాడు సుఖాసీనులై యుండ నగ్నిదేవుండరుదెంచి దీనాలాపంబుల నిట్లనియె.

క॥ ఘృతధారాపూర పరి । ప్లుతదేహుండనై తివావ్య భోజనమునసీ
గతిగ గ్లానజీర్ణత్వంబున । సతినుతులానందమొంద సాకారనన్నున్ ॥

ఉ॥ ఏమనవాడనోటగతి । యెవ్వరు వికారలు గాక భూధరో, ద్దామము
ద్రావ్యటుట్టీ యవ । తారములెత్తిన శూరరత్నముల్, మీమహిమల్
నుతింపతరమే । శరణాగత నిన్ను బ్రోవనే, ధీమణులార నారుణము ।
దీర్పరె పుణ్యము గల్గు మీ దగున్ ॥

క॥ మంచిపదార్థములను మో । చించక కుక్షింభరత్వ శిక్షనెపదు భ,
క్షించినవానికి రుజము జ । నించదె కదెలియనైతి నేరము గల్గెన్ ॥

శా॥ రాశీవర్బలహీనమై దగియుజీ । ర్ణవ్యాధినైయుంటి లో, కాలోకం
బుల సంచరించి । దరిదాపం డందు లేకున్కి- చిం, తాలోలాత్మతబొహ్మ
జేరిదెలుపన్ । నన్నిట్టునోదార్చెనా, భీలవ్యాధిహరించు ఖాండవ ।
వనంబేమందు పొమ్మనెన్ ॥

వ॥ అని యొడంబరచిన నేను నవ్వనంబు జేరి దహింప మొదలిడితి సురనాథ
చోదిత ఘనాఘనధారోదార బాధితుండనై మరల పరమేష్ఠిం జేరితి నంత
నాకతండిట్లనియె,

మ॥ నరనారాయణులాదిమానులు సదా । నందుల్ జగద్భార బం, ధుర
ముల్ మాన్పజనించినారు । హరిపార్థుల్ వారి బొమ్మనవ్వరున్, శర
ణన్నన్ గామనుపర్ సమర్థు । లనఘా సామాన్యమున్, జేరితేన్ కరుణా
సాగరులౌరనన్ । మ్మనుప కే కార్యమ్మింపారగన్ ॥

క॥ అనియక్షయతూణీరం । బును గాండీవమొసగి పాండుపుత్రునకు రమే
శునకున్ చక్రము గద వరు । ణుని చేనిప్పించె నాథ నంజడుడు కృపన్ ॥

వ॥ అంత కృష్ణార్జునుల భయంబొసంగి హుతాశను వెంటనిడుకొని ఖాండవ
వనంబు జేరి యయ్యోషధుల భక్షించుమని సెలవిడినతండు దహింప
మొదలిడియె మేఘంబు లెప్పటియట్ల వర్షింప నరుండు శరపరంపరల
వారింపదొడంగిన ఖేచరులు ఖిన్నులై చూచుచుండిరంత నదిగుర్తెరింగి

మ॥ సురనాథుండు ముకుందపార్థులను । తో జూచెన్ వినిర్జింప న,
చ్చెరువై తోచగ చిత్రరూపమున యో । చింపన్ నభోవాణి ఖే, చర

నాధుంగని యిట్లుబల్కెను మహా సామర్థ్యధౌరేయులీ, నరనారా
యణులజ్ జయింప తరమానా సంధిసేయందగున్ ॥
ఉ॥ యాదవకౌరవాన్వయము లందుజనించిన రాజమాత్రులా, యాదట
మానుషైబదరి కాంతరసీమ నసించిభూమి భా, రోదయముఙ్ హరింప
తల పూనిజనించిన వారువీరలిం, ద్రాదురమందు నిల్వగల వా
బలవంతులు వారలెవ్వరున్ ॥ వ॥ గతజలసేతుబంధనంబు దీనికి
వగపంబనిలేదు మఱియరించును నీసఖుండగు తక్షకుండు కురుక్షేత్రంబు
నకుంజనినను నశ్వసేనాఖ్య భుజంగంబు తన పితృమాతృలిలు దహించు
టచే మాత్సరంబున నాగాస్త్రంబై కర్ణునితూణీకరంబున జేరగలదు న
ముచి పోవకుండగు మయుండు రక్షింపంబడియె నీవుసఖ్యతసంపాదించు
కొమ్మన కృష్ణార్జునులంజేర బహూకరించి తోలించె కొన్నాళ్లకు.
సీ॥ పాకారిసత్కృపాపటిమచే నస్త్రప్రాప్తి, యోగోపసంహార యుక్తి దెలిసి
తత్ప్రేరితముగ నుద్ధతసాగరనిమగ్న, లనివాతకవచాదుల్ దనుజవరుల
కోటిత్రయంబును గూల్చి పదంపడి, పౌలోమముఖుల నర్వదియు వేల
దానవనిశాటులన్ దునిమి ప్రీతులజేసె నాకేశునంత త్రిలోకవిజయ
గీ॥ కీర్తిగాంచెను పార్థుండకిల్మిషుండు, రాజసూయాధ్వరము ధర్మరాజు జేయ
గడగియున్న తనసఖులకెల్లోకవలల గెల్చె. దిగ్విజయలక్ష్మినతను సాధించి యించె
వ॥ మఱియు నగ్నిదత్తంబగు రథంబధిరోహించి యుత్తరదిగ్విజయార్థం
బరిగి పుళిందనాధుని, కిరీటవింధ్యుని, భగదత్తుని, బర్బర, శబర, మాళ
వ కాశ్మీర గాంధార, కాంభోజ, కోసలాది రాజన్యుల జయించి ధనం
బార్జించి నిర్విఘ్నంబుగా రాజసూయంబు సమాప్తిగావించి భ్రాతృ
వత్సలుండైయుండెనంత కొన్నాళ్లకరణ్యవాసంబునమున్న సమయంబున

—( తపోనిష్ఠ )—

క॥ అన్నల దమ్ముల విడచి స మున్నతుడర్జునుడు జని తపోనిష్ఠదగన్
మన్ననలొందెను సురపతి పన్నగధర ముఖదిశాధిపతుల కృపాప్తిన్
శా॥ అల దుర్యోధన మాతుల ప్రకట మాయాకల్పితద్యూతమున్
దలపు ప్రార్జిత దంతివాజి రథ సేనాభోగ రాజ్యార్థమున్
జలమున్ బోనిడి ధర్మనందను డరణ్యంబేగి యందందు త
మ్ములతో నుండెను ద్వైతి కామ్యక వనంబుల్ వాసమై నెప్పుడున్ ॥
వ॥ ఇట్లు వనవాస క్లేశపాశబద్ధుండై యుధిష్ఠిరుండొకనాడు సవ్యసాచి కిట్ల

నియె. మున్ను వ్యాసుండు శత్రువిజయ సాధన సంపాదకంబగు నొక
మంత్రంబుపదేశించె నీకిచ్చెద సురేశ గిరీశుల గురించి తపంబొనర్పుము
తద్దివ్యసాధనంబులచే శత్రుజయుల మగుదుమనిన యర్జునుండు మం
త్రోపదేశపూర్వకంబుగ నాజ్ఞాపితుండై బాణబాణాసన తూణీరాదుల
ధరించి యుత్తర దిగ్యానపరతంత్రుండై తపోవనంబునకు జనియె నద్దుర్గ
మారణ్య గిరిగహ్వరంబుల నతిక్రమించి

క॥ చని యింద్రకీలకంబున । వనమున తపమూని యుండ వాసవుడు తగన్
మునికోలె వచ్చె నిముదం । బున పార్థుని గాంచి పల్కె పుత్రప్రీతిన్ ।

మ॥ అమరాధీశుడ నీకు మేల్పడవి జే । యన్ వచ్చితిన్ నీయభీ
ష్టము దెల్పందగు నన్ను మెచ్చి । సురరాజా శత్రుసంహారకో
గ్రమహాస్త్రంబుల నీకృపంబడయగా । భ్రాత్రాజ్ఞచే వచ్చితిన్
సుమనస్స్తుత్య మదీప్సితంబులివి । నన్నున్ బ్రేమ రక్షించవే।

ఉ॥ నావుడు హైమభూధర । వనంబున శంభుని గూర్చి తపంబు నీ
భావమునందొనర్పుమట । భవ్యతశాస్త్రములౌదలిచ్చు నీ
నీవల నీకొసంగెదన । హీనవిపక్షయ సాధనంబులన్
భూవర నీమదిన్ వగల । బొందకు కోర్కె ఫలించు నిక్కమున్॥

వ॥ అనిన పార్థుండు వల్లెయని యోగబలంబున హిమశైలంబున కరిగి
హరుం గురించి యత్యుగ్ర తపంబొనరింప నచ్చోగవాండ్ర తద్వననివాస
తాపసులు పశుపతిపాలికిం జని యిట్లనిరి.

మ॥ గిరిజాధీశ్వర పాండుపుత్రుని తపో । గ్నిజ్వాల లెన్నో భయం
కరమై జాపడి మానివాస వనమున్ । గార్చుచున్నన్ గాల్వగా
బరగెన్ భూగగనాంతరాళ దిశలున్ । వ్యాపించె తద్ధూమముల్
హార ముందెన్నడు నెవ్వరీతపము । జేయన్ జూడ లేదంచనన్ ॥

క॥ వానియభిప్రాయంబును । నే నెరుగుదు మీరలు జనుడు వేడతనికి బ్ర
హ్మానందంబును గూర్చెద । మౌనీశ్వరులారయని యుమాధవుడంతన్

క॥ ఆ కాననన్ మూకాసురు । సూకర సాకారమునను జూచుమనుచు కిరా
తాకృతి గైకొని పీనును । శ్రీకంఠుడు భీకరముగ జేరెన్ వనికిన్॥

వ॥ అంత నవ్వరాహంబు గుర్గుర ధ్వానంబున ఘూర్ణిల్లం జేయుచుండ నవ్వి
జయుండు ఘోరశరంబున గూలనేసిన వెంటనే ముక్కంటిశర మొక్కంటిప
యొంటిపంటి మోకంబునకంటించి గెంటించినంత నరుండు.

ఉ॥ ఎవ్వఁడవీవు? పందిబడ నేసితి నేను మృగవ్యధర్మము౯
దప్పెలనుంచి యేయుగ మ దంబడి యేలరనీవు బోయ నీ
కొవ్వఁడ గింతు నేరికి న గోచరమైన వని౯ బలంబుతో
జవ్వని గూడియుండుటకు సాహసమూనితి వేర దుర్మతీ॥

క॥ వావుడు కిరాతుఁడిట్లను నీవెవ్వఁడ వీవనమున నేలచరించ౯
నావాలున గూలెను కిటి యీవల కేవలము నీవ యేసితివౌరా॥

ఉ॥ బీరము లాడి నన్ను వెర పించిన పోయెదు వాడగాను వా
క్రూరత జూపనల నలుగల్ గలవేని ననుం జయించు లే
దారభసంబున౯ దొలుగు దైన్యము తోనన కోపదృష్టి దు
ర్వారశరక్షతి౯ జొనిపె పార్థుడు బోయని కాయమంతట౯॥

క॥ భిల్లుఁడు ల్లాసంబున పెల్లునజల్లుగతి వేనవేల్ శరములు రా
గిల్లిన మల్లుడు పార్థుం డల్లనసల్లాడ నేసె నల్లాస్త్రవిధి౯

క॥ గాండీవజ్యానాదము కొండలు ఘూర్ణిల్ల శరాళి గుప్పునతండు
ద్దండుండై యుండిన పా ర్థుఁడంతతెలిసినఖండుఁడని యెదురొక్కనిమరల౯॥

చ॥ ఇతఁడు మహానుభావుఁ డర హిల్లగభిల్లుని రూపునుండు దై, వతముడొ
శిద్ధుడో కొక్క పెరవారికి యిట్టి బలంబదేల నం, చతిజవమూనిపట్టికొని
యాతని నిష్ఠుర ముష్టిఘాతల౯, క్షతలొనరించె నచ్చట నిషాదులు
సాధులు యోధులెన్నగ౯॥

వ॥ అంత కౌంతేయుని విక్రాంతమునకు సంతసిల్లి కంతువైరి యుమాకాం
తతో ప్రత్యక్షుండై. వత్సా! నీబలంబునకు తపంబునకు మెచ్చితి. నీ
మనోభీష్టంబుగా గొనుమని దిగ్విజయ సాధనంబగు పాశుపతంబను గ్ర
హించిన నయ్యర్జునుండు సంతుష్టుండై సాంబునినన్నుతించిన హరుం
డంతర్ధానంబయ్యె నంత,

క॥ పాశుపతాస్త్రంబును గిరి జేశునిచే నొంది పార్థు డేగెనపుడు నా
కేశుండంపినరథ మం దేసుండై వెల్పు లేని వీటకికడిమి౯॥

—( ఇంద్రియనిగ్రహత. )—

క॥ తనరూపసుందరము గను గొని దేవాంగనలు మోహ గుంభితులైన౯
గనుగొనలగనకుంతీ తనయుడు విజితేంద్రియుండు తత్కథవినుఁడీ॥

క॥ సురసిద్ధసాధ్యఖేచర గరుడోరగకిన్నరులును గంధర్వగణం
బిరుగడలఁగొల్వనమ రేశ్వరునధాసనమునందు వరుస౯ సలచె౯॥

వ॥ విజయుని విక్రమంబు వేల్పులకు విన్నవించి యింద్రుండు సాయంసమ
యంబగుటయు నొకమణిమయ సౌధంబున విడిదిగావించి విజయుని పు
త్తెంచిన నతఁడేకాకియై తల్పంబున శయనించిన యారాత్రి నూర్వసిత
కళాలాస్యంబుల ప్రొద్దుబుచ్చి యిట్లనియె.

మ॥ హరు మెప్పించితి వద్వితీయ భుజశౌర్యాటోపమున్ రూపమున్
మెరసెన్ నీయసమాన్ల దిక్కులను సుచుల్ సంచెన్ భవత్సుందరా
కృతదేహంబును జూచి మోహమున నిన్ కౌగింటజేర్పన్ పర
స్పరసంప్రీతిని వచ్చియుంటి నను శుంభత్కేళి నోదార్పుమా॥

క॥ అని దరహాసంబున బల్కొనుకుచముల తళుకు బెళుకు లేజవ్వనముల్
గనుపింపజేయుచును పైకొనుశిగ్గున మోము ద్రిప్పి కొనిహాయలొప్పన్

వ॥ అర్జునుండామాట కచ్చెరువంది యిట్లనియె.

ఉ॥ తల్లివి నీవు నాయెడ సుతప్రియత్వంబున వచ్చినావటం
చుల్లము పల్లవింప నిటనుండితి కూర్మిరవి శారదచేష్టలన్
జెల్లని మాటలాడుటకు జెల్లున వజ్రనకేంద్ర మోహపున్
బల్లవపాణి నీవుగద పాపము నాకొనగూర్ప వచ్చితే।

క॥ నగభేదిపీఠిలో నన్నగభేదము గల్గునాతనయ మాతలకున్
తగదమ్మా పాపముచే తగదమ్మా మురలిపొమ్మ తల్లివి సుమ్మా

వ॥ అనిన యూర్వసి యిట్లనియె.

గీ॥ మామయల్లుడు తండ్రికుమారుడనుజు డగ్రజుడు బావమరదులు
నాజిజనిన సవతుసగ్గిన మముగూడికొనరె దివిని।

చ॥ వరుసలమాటయేల త్రిదివంబున వేల్పు నాకకామినుల్
వరుసగ గూడియుందురిట వచ్చిన వారల నీవెఱుంగవే
నరవర వంశ యింపకు మ సంబునొందు దలపకన్ భవ
త్కరయుగ సంధిజేర్పు సురతప్రియభర్గ నలకాల్పుమిత్త్రరిన్

ఉ॥ నారదుడున్ మునుల్ సురల నారతముల్ దివిజుల్ గణింపగా
కోరికలింతు నిందునను కూలత వచ్చుటజేసి కోర్కెచే
కూరిననటంచు నమ్మితి వికుంఠిత మోహభరంబుచేత భూ
పా! రతిగూడు లేనియెడ పాపము శాపము ప్రాపితంబగున్

వ॥ అనిన నయ్యర్జునుండు దనరక యిట్లనినను

గీ॥ కోపమైనను నీచేత శాపమైన పాపమైనను మరి జాతరూపమైన

నెట్టిదేశాని నేనొడిబట్టియుంటి కర్మవిధితప్ప దెంతటి ఘనునకైన।

వ॥ అనిన యూర్వసి యాగ్రహంబున-

శా॥ నాయిష్టంబొన గూడవైతివిర కాంతాలోక మధ్యంబునన్
శ్రీమోదూరత మానహీనత స్వపుంసీభావమున్ లేక నీ
వేయుండంగలవాడవు ర్వాను వాదేలా! దురాశాగతిన్
బాయన్ జాలక వచ్చినానసుచు శాపంబిచ్చి పోయెన్ త్వరన్।

వ॥ ఆవృత్తాంతంబు వృత్రాంతకుండువిని నిశాంతంబునకు తన్నిశాంతంబున కౌంతేయునింబిల్పించి యిట్లనియె.

ఉ॥ కంటికి నింపుగల్గు తెర గంటెని నొంటరి నాటనంటి కౌ
గింటను దంటచేరగని గెంటకజేసిన బాటువీవు ము
క్కంటికి తమ్మికంటికి న కంటకచిత్తము తోంటెనుండి నీ
వంటి జితేంద్రియుండు నెటువంటిపురిన్ గలడయ్య యర్జునా॥

క॥ ఊర్వసి యిచ్చినశాపము సర్వరనొక వత్సరంబు నొందెదు తేఃద్రీ
తర్వాత నీస్వరూపము పూర్వమువలెనుండు వగలె బొందగనేలా॥

వ॥ ముందజ్ఞాతంబున కీషండత్వం బనుకూలంబగునని వరంబొసంగి నానా
స్త్రంబులిడి పంపిన వెడలి తనయున్నదమ్ములంగలసికొని ద్వైతవనంబున
నుండెనంత.

—( సౌజన్యము )—

గీ॥ ఘోషయాత్రకువచ్చిన కురుబలమును చిత్రరథుఖ్య గంధర్వసేనవలన
చిక్కుపడువారి వల్ల రక్షించెకరుణ తనిసౌజన్య మేమని యభినుతింతు

ఉ॥ ద్వైతవనాంతరంబున పృ థాసుత పంచకమున్న వేళ దు
ష్ప్రేతక దా సుయోధను డ పరబలంబుల గూడి ఘోషయా
త్రాతతయూహబూని ధృ తరాష్ట్రునమజ్ఞవహించి సోదరుల్
సూతతనూజ మిత్రసుతులున్ గొలువన్ జని తాచుశానకన్॥

క॥ జనిముందర పరిజనులను తనకుందగు చోటుజూడ త్వాగబంపిన న
వ్యానసరసీ తటమున నెంటనెనిల్పి పందిరుల గుడారముల వెసన్।

గీ॥ అందుచిత్రరథుడ నవాడు గంధర్వనాయకుడు సంచరించు వనవరతము
నతనిపరిజనులకు ధృతరాష్ట్రసుతుతుకు జనులకపుడు కలహముసుజనించె।

క॥ గాంధారేయాదులకా గంధర్వుల కాహవంబు గగ్గెనపుడు గ
ర్వాంధుండగుదుర్యోధనుండటబంధీకృతుడయ్యె బాహుబలశూన్యమునన్

గీ॥ పోరునపుడు కౌరవుల సతీయుతముగ చిన్నపెద్దలనక చేరంబట్టి

కట్టియీడ్చుకొనుచు గంధర్వపతియేగెఁ గాధరాఁడకు సంగరమునజిక్కి
క॥ సేనలు డీసత దిక్కుం గానకనక్కఁ జనుచున్న కౌంతేయవరుల్
గానగజని కురుపతి యవ మానము వినిపించిరపుడు మదిదిగులొందన్
క॥ శరణని వేడిన కురుపతి పరిజనులకు నభయమొసగి పాండుసుతుండ
ధ్వరమొనరించుచు నిజపో దరు పార్థున కిట్టులనియె దయతళుకొత్తన్
క॥ మనయండాశ్రవహించియు జనుదెంచిరిపీరు మూరుజని కౌరవులన్
పనిబడి రక్షింగిన మీ ఘనభుజవిక్రమము మెరుంగుగా కురుపతియున్॥
మ॥ మనలోనన్ మనకెట్లనో కలహసంబంధంబులన్ గల్గియుఁ
డిన లెక్కింపకు మేకవంశ్యులము వానింజూడు లోకుల్ నయో
ధనుడున్ సోదర దారయుక్తముగ బంధప్రాప్తుడై యేగడా
కనియున్నారట పాండునందనులు నిష్కారుణ్యులంచాడరే॥
వ॥ అనిన యర్జునుండిట్లనియె.
మ॥ మనకెగ్గుల్ దలపోయవచ్చినటకున్ మానంబుఁబోనాడి రా
యనయుల్వారి ఫలంబు వారికనిరో యన్యాదయాహీనతన్
గనవేలా మనముండి కాదగు పనుల్ గంధర్వులే తీర్చిరో
యనఘా ద్యూతపరాభవంబెరుగ పాహా ద్రోహులన్ బ్రోతురే।
వ॥ అనిన ధర్మజుండిట్లనియె నిది మునుమవి లెక్కింప సమయంబుగాదు దురా
త్ములఁ బక్షించుట దోషజ్ఞులలక్షణము-
చ॥ నలుగురు మీరలేగి గగనంబునఁబోవుచు ఖేచరాళి ని
మ్ముల పినుతించు దండుకు వి ముక్తులఁజేయక పోయిరేని దో
ర్బలమున గెల్చి కౌరవుల బాధనముక్త వెసలింపుడీ జనం
బులు గొనియాడు భూరియశముల్ సుకృతంబు గదయ్య తమ్ములా॥
వ॥ అనిన తదాజ్ఞవహించి ధనుర్బాణంబుల సంధించి సవ్యసాచి సరభసం
బున సోదరయుక్తుండై గంధర్వుల ముట్టడించి మహాశుగణంబులచే
మార్గావరోధనంబు గావించి యిట్లనియె.
ఉ॥ ధర్మసుతుండు ధార్మికుడు దారుడు నాతని పంపుజేసి మే
మ్మిలి వచ్చినారము తదాజ్ఞ యలంఘ్యము మీకు మాకు మా
కూర్మికి తోడుగా వినుటకున్ మదిబూనుడి లేదయేని మ
త్కార్ముక బాణఘాతములు తప్పవు వీడుడి కౌరవాదులన్॥
వ॥ అనిన గంధర్వులు గర్వాంధత బెనంగ మొదలిడి రంత నర్జునుండు వి

జృంభించి బాణపరంపరలు బరపిన చిత్రరథుండచ్చెరువొంది యిట్లనియె
శా॥ గాంధారేయుల పట్టి తెమ్మనుచు ॥ పాకద్వేషిమమ్మంపగా
బంధీభూతులఁజేసి పట్టితని ॥ పోవకా మీరలిట్లేల గ
ర్వాంధుండీతఁడు మీరు గాసిల ॥ నరణ్యావాసులఁ జేసె మీ
శాంధవ్యపియుడుగాఁ త్యజించు రిపులన్ ॥ జాలింతు రే ఫల్గునా॥
వ॥ అనిన యర్జునుండిట్లనియె.
ఉ॥ భూతలమందు ధార్మధనుయుగ ॥ పుడమెన్ గొనువేళ వైరముల్
జ్ఞాతికి జ్ఞాతికిన్ గలుగు గాక ॥ తదన్యులు వారి నెవ్వరో
ఘాతలోనర్ప నేకకులగౌరవమున్ ॥ వడగుంగజాతు రే
నీతియె ఖ్యాతియే మది గణించుమి ॥ ఖేచరలోకనాయకా॥
గీ॥ ధర్మజుడు మిమ్మనేకవిధముల బొగడు ॥ మీరుమీకొనరించిన నేరముల స
హించి నాయన్న కిపుడప్పగించి పొండు ॥ నాపుడారీతి గావింపనాత్మనెంచి
వ॥ పార్థునింగూడి చిత్రరథుండు ధర్మజుపాలికేతెంచి కౌరవులనిడచి దేవ
లోకంబునకు జనె నంత కౌంతేయాగ్రజుండు కౌరవపతి కిట్లనియె.
చ॥ జనుడెవడైన గాని ॥ తనశక్తి నిమించిన కార్యమెద్ది జే
సినసఫలం బుగాదు చెడజేయును ॥ మానవిహీనమౌ హసిం
చనిజనముల్ హసించుమరి ॥ వచ్చిన గాని సమంబుగాఁ సుయో
ధన కొరగాని చేత నిద ॥ దల్పకు తల్చితి వేని చేటగున్॥
శా॥ నీవే కాక హితులు ॥ శత్రుజనముల్ ॥ నీ భ్రాతలున్ పుత్రులున్
నీవధిక్ష్మాచమూసమూహమిట ॥ బంధీభూతులైనారు నీ
భావంబందు దలంచవెంతపని ॥ దుర్వార్తా పారము ల్మాను నీ
వీవంతన్ మదినెంచకుండు ॥ విధిరానవ్వాడు మాన్పన్ గునా॥
ఉ॥ రావణుడొక్కనాడు బవ ॥ రంబున వాలిని కార్తవీర్యునిన్
గేవలమున్ జయింతునని ॥ గొబ్బన చిక్కి చెరన్ వసించె న
ట్లైపు జయ్యపవచ్చి యిట ॥ హీనతజెందితి వింత పాపమో
భూవర యింకనైన తగు ॥ బుద్ధివహించి మెలంగు మేలుగన్
మ॥ కురునాథా విపరీత ॥ కార్యముల లోకుల్మెత్తురే మోము మం
దరమా టాడక యుండినన్ ॥ జనులవార్తల్మిమ్ము మాట్లాడవే
పరివారంబపకీర్తి హేతువ ॥ దురాశన్ దుష్టులంగూడి యీ
కొరగాముల్ తలపూని ॥ చిక్కితివి నీకున్ దోచదేయిప్పుడున్॥

రేడ యిందొక్క యేడనుసరించుచు । వెంటియునుండకుండు నే
చేడెయుగాను మావఝడ । చెప్పెద నొప్పుగ గానలాస్యముల్
పోడిమి తాదకన్నెలకు । పూర్వమునుండి యిదే ప్రచారముల్ ॥

వ॥ అనిన విరాటుండిట్లనియె.

ఉ॥ పేడితనాన కంధవి యబంధన । వహ్ని జేలంగినట్టు లు
న్నాడవు మానవుండవని । నమ్మదు నెమ్మది సందియంబె బో
యూడుజగాల నేలెడు స । మాజ్ఞల మూర్తిఁ వఖాడమైన బల్
పోడవు గాని యుల్లుండవె । పూతచరిత్ర యిదేమిహేతువో॥

వ॥ నీమాటలు నాకు విరుద్ధంబై తోచె కానిమ్మని యుత్తరను బిలచి బృహ
న్నలం జూపి యిట్లనియె.

ఉ॥ ఈమహనీయమూర్తిఁ పుడ । మీకుల కన్నెలకెల్ల గానవి
ద్యామహిమల్ సమగ్రభరతంబు । నభంగుర రంగభేదముల్
సామహితోక్తి దెల్పునట । సాదసలోచన నీవు తత్కళా
స్థోమము సంగ్రహింపుమిట । చొప్పుగ జెప్పగనొప్పు నిప్పుడున్ ॥

వ॥ అనిబుజ్జగించి బృహన్నలకుజూపి యిట్లనియె.

ఉ॥ పొన్నల మానికన్నలను । పున్నమవెన్నల లేబయొళ్ళలో
గొప్పిన్నలగాలకిన్నియల । కూర్పనెయున్నది కన్నెమిన్న రా
యన్నలు గొల్పుచుండగ । బృహన్నల కన్నుల సన్నలన్ బనుల్
గొన్నది వన్నెచిన్నెలను । గొన్నదిగాదు ప్రసన్నమానసా ।

వ॥ అనియప్పగించిన నర్తనశాల ప్రవేశించి రంత శుభదినంబున విద్యాభ్యా
సంబు గావించుచుండె.

గీ॥ దండలాసక విధమునుకుండలియును । బెక్కు ణంబును వాద్యంబు బేరణంబు
మంజులశ్రుతిగతుల సంభావ్యగీతక రంగవిస్ఫుర భనైపద్య సంగతులును

క॥ దెలుపుచు సద్భావాశ్రయ । ములరాగ స్వరలయాది మూర్ఛలతాళో
జ్జ్వల భేదంబుల బలుకీ । తుల దినదినము కభంగి దెల్పె తొ పికమతియై॥

వ॥ ఇట్లు భరతశాస్త్ర ప్రజ్ఞాధురంధరుండై యుండె నంత-

( శౌర్య ప్రకటన )

క॥ ఉత్తరగోవులకొరకై । యుత్తరుని సహాయమూని యుద్ధమునందున్
చిత్తజు వైరివిధమున వి । యత్తల మద్రుంగ శౌర్యమదిజూపె చెన్ ॥

చ॥ కురుబలమెల్ల మత్స్యపతి । గోవులగైకొని పోవుచుండ వే

వ॥ అని శ్లాఘించిన యుత్తరుం డిట్లనియె.

మ॥ విపులాటోపశిలీముఖా । సనగతాఖిలాశుగవ్యూహా మ
చ్ఛపలద్రుష్టిఁ గన్గుడించి । పైబరుపకేశంబులన్ ముడిఁజార దూ
రపుమార్గంబుల కేగి । యుత్తరకుమారా మన్నుమన్నించు మా
యపరాధంబు క్షమించుమా । చనగఁ జేయంగలేనె కౌరవ్యులన్ ॥

వ॥ అనిన దరహాసంబున బృహన్నల యిట్లనియె,

ఉ॥ వారినివారి సైన్యమును । వారకఁ జూడక మున్న వీరు దు
ర్వారపరాక్రమస్ఫురణ । వర్ధిల జేయుచు నుంటి వౌభళీ
వారిఁ జూచి సంతతము । వైరిశౌర్యము ధైర్యశక్తిమీ
తీరుగ నట్లె చిత్రమగు । ధీరుల మాటల కడ్డు గల్గునే ।

వ॥ అని రథంబు యత్నరచి యుభయుల దీప్తించి చనునెడ యుత్తరసమీ
పించి యిట్లనిరో,

చ॥ సకలనృపాల సంఘమును । సంగరరంగమునన్ జయించి మూ
ర్ధకలితనూత్నరత్న స । మగ్రకిరీట శిరోంబరావలీ
శకలము లింక దెమ్ము భుజ । శౌర్యమొలర్పగ నాదుబొమ్మ పా
త్రికలకు యోగ్యమౌను భవ । దీయజయంబు జగంబెరింగెడున్

వ॥ అని సువాసినీ జనంబులుఁ మంగళ నీరాజనంబు లిడిన వారు వారు
వేగంబున జనిరంత బృహన్నల యుత్తరుం గాంచి యిట్లనియె

క॥ నీవాత్మలు కౌరవులును । నీచినము నందునున్న తెరవొగిఁ తివే
చూచితె గనపడ రిచ్చట । యేచాయ రథంబు దోలుదెరిగింపు దగన్

వ॥ అనిన యుత్తరుండు లేచి నలుదిశలు బరికించి కురుసైన్యంబును గాంచి
దైన్యంబున నిట్లనియె.

ఉ॥ ఇన్నని లెక్కలేని హయ । లేనుగులున్ రథముల్ దొరల్ భటుల్
మిన్నును ముట్టె తక్షణము । మేదిని నెవ్వరు వీరి గెల్వగా
నున్న మహాత్ము లేరి యిఁక । యుద్ధము చాలు రథంబు ద్రిప్పుమీ
కన్నుల జూడగా వశమె । కౌరవసైన్యము నో బృహన్నలా ॥

చ॥ కొలది యెఱుంగలేక యిట । గోవుల దెచ్చెద నంటిఁ గాని యీ
బలమును జూచి నిల్వగల । వాడెవడాజిని లోకమందు నా
కులు కుజనించె నింట తిని । యుండక లేనిది దెచ్చికొంటిఁగా
వెలవెలబోయె నామనసు । వెన్కకు దీగుట మంచిదన్నిటన్ ।

వ॥ అనిన బృహన్నల యిట్లనియె.

క॥ జయమునజని కౌరవ వంశ । జయమును విదలించి గోవి జయమును గొని
నిర్భయముగ వచ్చెదననిజని । భయమునపురికేగ నవ్వుబాటులుగావే॥

వ॥ అనిన యుత్తరుం డిట్లనియె.

ఉ॥ నాపురిలోన మానవులు । నన్నని నవ్విన నవ్వనిమ్ము మా
భూపరిపాలనంబు పశువుల్ , ధనధాన్యము లేగనిమ్ము యా
మాపురులెల్ల నిందలిడు । చుల్కన జూచిన జూడనిమ్ము నా
యూపిరి యుంటెజాలు నని । కౌర్వను నీదయ నోబృహన్నలా॥

వ॥ అని పరితపించుచున్న యుత్తరుంజూచి బృహన్నల ధైర్యంబు పురికొల్పి యిట్లనియె నీవు సారధివిగమ్ము నేరథికుండనై కౌరవుల గెల్చెద పశువుల మరల్చెద నని యొడంబరచి శమీవృక్షనిక్షిప్త బాణంబుల గ్రహించి నిజరూపంబు జూపి కౌరవ పరివారంబు నాక్రమించి యట్టహాసంబున పశువుల పురిమార్గంబుబట్టించి క్రమంబుగ దుర్యోధన దుశ్శాసన ద్రోణ పితామహ కర్ణ వికర్ణ ప్రముఖులతో బెనంగి సమ్మోహనాస్త్రంబుచే గూల్చి వారి శిరోంబరంబుల గొనిపచ్చుచు తనయుడంత యెవరికిదెల్పకుండ యుత్తరునకుజెప్పి పురికేగుచుండనంతట

చ॥ విరటుడు ధర్మజుండు పరి । వేష్టిత మంత్రిహితాను భృత్యులై
బరువడినుండి యుత్తరుడు । వచ్చెడిదాక వృథాప్రసంగ వా
క్స్ఫురణమదేల నంచు నమ । కూలత పాచిక లాడుచుండ ను
త్తరదిశనుండి గోపకవితానము । వచ్చిరయాన నిట్లనున్॥

శా॥ దేవా నీకొమరుండు శత్రుజన । కంధిర్జొచ్చి తామందర
గ్రావంబట్లు మధించి రాణ్ణిచయ । మూర్ధ ప్రాపి తోష్ణీషముల్
చేవర్జేకొనివచ్చె ముందుగ । మరల్చెన్ గోసమూహంబు నా
హా వీరోత్తముడన్న నీసుతుడె । భూపాగ్రేయ మత్స్యేశ్వరా॥

వ॥ అంత విని సంతసంబున విరాటుండు కంకున కిట్లనియె.

ఉ॥ వింటివె కంకుడా సుతుని , విక్రమమున్ గురుసేనజేర ము
క్కంటికి తమ్మికంటికి మగంటిమి । గల్గునె దంటలేక తా
నొంటరి నేగి కుంభజ సుయోధన । కర్ణ నదీసుతాదులన్
గెంటిపడంగజేసె తన । గెల్పుజగద్ధితమై జెలంగగన్॥

చ॥ కొడుకుల గాంచనేల ప్రజకున్ । దలిదండ్రుల కాప్తకోటికిన్

గడుమూఁడవమీ యకున్న । కొడుకా పడుకానిన పాపుగాక నా
కొడుకటువంటివాఁడె । త్రిజగంబుల జూచిన లేదు సాటి నా
కడుపునఁ బుట్టె యుత్తరుఁడ । ఖండపరాక్రమశాలియైదగన్ ॥

వ॥ అని కుమార విజయోత్సవంబు చాటింప నియోగించిన కంకుఁడు విరాటున కిట్లనియె.

ఉ॥ కన్నులజూడఁగా తనవికారము । గల్గినకాలరీతినీ
కన్నులకాటపాటులు దగన్ । వచియించినయంత మాత్ర సా
ధ్యన్నతి మానలేదు విను । మోనృప యెవ్వరికిన్ బృహన్నలున్
డున్న జయంబవశ్యము । బలోద్ధతి యామెయిగాలిపోకిరన్ ॥

క॥ శూరత రిపుఁడు బృహన్నల । శూరత సుకుమారతయు త్రిశుద్ధిగనే క
న్నారగ జూచితి వింటిని । పీఁకండొకఁడున్న సాటి విజయుఁడు దక్కన్ ॥

వ॥ అనిన యాగ్రహంబున విరాటుండు కంకుని ఫాలతలంబున పాచికతో గొట్టిన రక్తంబు స్రవింప చేరంగన పాంచాలియద్ది తన్మహిమ తేర్ప డందెల్పిన నృపతి యపరాధంబు క్షమింపుమని వేడికొనియె నంత.

—( ఉదాత్తవర్తనము. )—

గీ॥ ఉత్తరునితోడ పార్థుఁడుదాత్తవర్త । నంబున విరాటనగరంబు నన్వసించె
మత్స్యనాయకుఁడాత్మకుమారుఁ జూచి కౌఁగిలంజేర్చి యిట్టుల సగౌరవముగ

శా॥ ముక్కాకల్యాడిదీరు కౌరవుల ని । ర్యాలంబు గావించి స
మ్యక్కౌశల్యమెలర్పవచ్చితివి । పుత్రా శ్రోత్రవంతుండవై
యొక్కండొక్కఁడు బెబ్బులుల్ । శరకళాయోధుల్ విరోధుల్ సుధా
భుక్కుల్ మార్కొనలేరు । వారి నెటులన్ బోనాడితో తెల్పవే ॥

ఉ॥ పీనులవిందుజేయు మర । విందభవుండు భవన్ముఖంబునన్
వ్రానిలిఖించె దిగ్జయము । పుత్రయులంతివి గావుజీవనన్
దీనతగల్గి యుత్తరుఁడు । తెల్పగజాగె బృహన్నలాభిమా
నానుగతుండునైయది । బయల్పడకుండఁగ నేర్పు పెంపునన్ ॥

ఉ॥ నేనజయించినానసుచు । నీవుభ్రమించితి వింతదాఁక తం
డ్రీనను జూడుకౌరవన । రేంద్రుని సైన్యము జూడుమస్త్ర సం
ధాననిధానమాగకాణ పి । తానధురీణుల నూనదోర్బలుల్
గానబృహన్నలాభిగత । గౌరవనీయుఁడు నాకుఁగల్పెడిన్ ॥

శా॥ ఏనుంగుల్ రథముల్ పదాతిచయముల్ । హేషారవోపేత వా

జీనంబుల్ సమదోష్ట్రసంఘములు । భూయుష్టాయుధాఖిలమహా
సేనాబృందముగల్గు కౌరవుల । వీక్షించఁ భయోద్రేకత
నేనున్ గన్నుల మిమ్ముఁజూడ । ననుకొంటిన్ గాదె చిత్తంబునన్ ॥
క॥ మున్నీర్వలె కన్నీరది, చెన్నారుచునుండ లేని చిన్నెలువాడమిన్
మిన్నున్నతి వెన్నునబడి । యున్నట్లుగ నుండ దైవ యోగము చేతన్ ॥
వ॥ బృహన్నలా హూయమానుండొక దైవతముడు నరాకారంబుగ వచ్చి పరిపన్నుండై నాకిట్లనియె.
శా॥ నీగోవర్గము నేయరల్చెదను గా । నీసారథిత్వంబు వే
వేగన్ జూనుము నానోడఁబడితి యా, వీరోక్తికిన్ మేర లే
దా గాంభీర్యము నాశరాసన । కళాభ్యాసంబు నాశక్తి తం
డ్రీ గాండీవియెగాక యొండుగలదే । నిక్కంబు తర్కింపగన్ ॥
వ॥ ఇట్లమ్మహాత్ముని సహాయంబుగ సారథినై సమరంబునకుఁ జొచ్చితిమి యా విజయుని విజయంబు వినుము యొక్కసారి శంఖంబు పూరించినంత.
క॥ అరవమున దిశలదిరెను । కౌరవ వీరులమనంబు గళవళమయ్యెన్
దారువువలె శవగతి ని । స్సారంబుగ నేను నొగలసందున బడితిన్ ॥
వ॥ నన్ను లేవనెత్తి మరలమరల శంఖంబునొత్తుచు నాచిత్తంబున వెరపుడిగించి యుద్ధోన్ముఖుండయ్యె.
శా॥ గాంగేయున్ గురుసిన్ కృపున్ గురుసుతున్ । గాంధారునాసోమద
త్తాంగజున్ భగదత్తు బాహ్లికునితోడ్తో ధార్తరాష్ట్రాదులన్ సముంగ్రల్
దరివ్వుచు వెన్కబోక విశిఖంబుల్ గుప్పవేర్వేఱగా । భంగంబొందగ
జేసె మూర్ఛనిడె దేవా మోహనాస్త్రంబునన్ ॥
వ॥ తర్వాత వారివారి కిరీటోష్ణీషంబుల నుత్తరకు బొమ్మపొత్తికలకై పరిగ్రహించితి నతండింతవరకు నన్నంపి యంతర్హితుండై పునదర్శనంబయ్యెడు ననినిది సమాచారంబనిన విరాటుండద్భుతంబొందె నంత,
క॥ ఆపార్థునిచే విజయము । గోపంక్తికి గలైననుచు గురెరుగని వా
రైపూర్వపు షండడని । యోపికతో గారవించి యుండెముదమునన్ ॥
గీ॥ అర్జునుండుత్తరునితో రహస్యముగను । వింతచతురంబుగాఁబల్కె తిం
తసేపు । వింతకును మిక్కిలెరిగింప కిఁక మీద, ననుచు నాతనితోఁ జనె
నంతిపురికి ॥
చ॥ కలియుగ బొమ్మపొత్తికల । కైయెదురీంగనుచున్న నుత్తరన్

నిలచి కురుక్షితీశుల మణిస్తకిరీటయుతాంబరంబులఁ
జెలియ గ్రహించు మంచునిజె చెలువ్వగ నచ్చెలి మెచ్చెరఁ బృహ
న్నలగొనియాడుచుఁ జని మానంబు నమించెదు కౌతుకంబునన్ ॥

వ॥ అంత పాంచాలియుక్తంబుగ పాండవులు బయటబడుదలంచి పేరోలగంబున వేరువేరు పీఠంబుల నివసించిరంత విరాటుండు విచ్చేసి కుపితుండై యిట్లనియె.

గీ॥ కంకుడా రాచగద్దెనెక్కుండదలంచి నావు నేటికిగల్గె కండ్లకును క్రొవ్వు
నావుడిట్లను పార్థుండా దేవపీఠి జేరుఘనునకు తగదెనీ చిరుతగద్దె ॥

సీ॥ పాండురాజోదర పాథోధి సంభూత, శాకారినైక సుధాకరుండు
రాజసూయాద్యధ్వర క్రియానైపుణ్య, సకలసంపద్భోగ సంయుతుండు
శరణాగతత్రాణ శక్తిప్రభూషిత, నిత్యసత్యవ్రతాన్విత గుణుండు, దిగ్దేశరాజన్య దీపితకోటీర, మణిగస్పృశ శుభత్పృదుండు ॥ గీ॥ విమతసందోహ విధ్వంస విక్రముండు భూనభోంతర పూరితం భూరియశుడు సద్గుణస్ఫూర్తి సంపూర్తి శాంతమూర్తి రాజితుండన్నిటను ధర్మరాజితండు ॥

క॥ నావుడు విరాటుడద్భుత భావంబున దెలసికలికె పవనాత్మజుడే
డీవిజయు డేడిమాద్రిజు లేవంక వసింతు కృష్ణయేదిమహాత్మా ॥

వ॥ అనిన పార్థుండిట్లనియె.

సీ॥ బకహిడింబకశ్వేత బరకలాగ్రవిభిన్న, భీమాశనిసముండు భీముడితడు
భవదీయహయపరిపాలదామగ్రంధి, నామధేయుండైన నకులుడితడు, దక్షిణోత్తరగోవితానపాలకుడు తం, త్రిపాలుడో సహదేవుడతడు, కీచకశతకభేకిభుజంగమూర్తియా, సైరంధ్రి ద్రౌపది సాధ్వియివుడు ॥ గీ॥ గురుతుబట్టితివేయున ధరణివిభుడు, యద్భుతంబను పాథోధియందుమునిగి, విక్రమవిభాసివీరుడౌ విజయుడేడి యనవృకోదరుండప్పుడిట్లనుచు బలికె ॥

సీ॥ కాలకేయాది రాక్షసకంఠవంలగ్న కాలపాశంబుగా గ్రాలెనెవడు
దహనసంతానదీక్షాహితప్రభావుడై ఖాండవారణ్యంబు గాల్చెనెవడు, శాంబరీశబర వేషమహేశు నిర్జించి పాశుపతంబును బడసెనెవడు, యింద్రాదిదిక్తలాధీశసన్మానిత బహుమానములనొంది బరగెనెవడు ॥ గీ॥ సకలకురురాజయోధ సమర్థమకుట నికట సందీపి

తో ష్ణీషశకలములను దెచ్చియుత్తరకిప్పుడొదిచ్చెనెవడు, యట్టిమహా
నీయుఁ డీతఁడే యర్జునుండు ॥

చ॥ అనువెడనుత్తరుండు విస్మయంబుఁ బ్రియంబు భయంబునాత్మలో
బెనఁగొన తండ్రికిట్టులను పేరవరేణ్యుఁడితండు చెప్ప వ
ల్దనినను పేక్షజేసితి మహాత్ములు పాండవులేనిజంబనన్
మనుజవిభుండు తప్పులఁ క్షమాపణ గోరెకొనెన్ వినమ్రుఁడై ॥

వ॥ తదుపరి విరాటుండు వినోదంబున సంబంధ బాంధవ్యంబు నొందవలయు నని పాండవుల నభినందించి యభిమన్యునకు నుత్తరనీయ నొడంబరచె నంత ద్వారకనుండి.

క॥ బలరామకృష్ణ సాత్యకు లలరుక్మిణి మొదలుయాదవాంగనలు భటా
దులతో వచ్చిరి వాద్యక ళలను సుభద్రాభిమన్యులను దోడ్కొనుచున్ ॥

వ॥ ఇట్లేతెంచి యాదవపాండవులు పరస్పర కుశలవార్తాకర్ణనోత్సుకులై శుభముహూర్తంబున యుత్తరాభిమన్యులకు శుభముహూర్తంబున వివాహంబు జరిపించియు పప్లావ్యంబున వసించిరందర్జునుఁడు దాత్తవర్తంబున నిగడుచుండె

—( బలనిరూపణ )—

క॥ ఆయుధమూనను యుద్ధముఁ జేయను సేనవుచుదెల్ప శ్రీకృష్ణుని కౌం
తేయుఁడు సూతునిగాఁ గోరె యుకయా విధముఁ బల నిరూపణమొంతున్

క॥ ఒకనాఁడు సుయోధనుఁడుం దకుమారుఁడు దేవకీతనయుని సహాయం
బికఁ గోరగవచ్చిరి ద్వారకకున్ స్యందనములెక్కి రథసముతోడన్ ॥

ఉ॥ శిల్పకళావిశేష బహు చిత్రసువర్ణ సువర్ణరత్నసం
కల్పిత సౌధభాగమున కాంచననిర్మిత హంసతూలికా
తల్పమునందు మాధవుఁడు తానమృషా కలితాత్ముఁడైల స
త్కల్పక పారిజాత సుమగంధము లొప్ప శయించెనంతటన్ ॥

క॥ కురుపతివిచ్చేసి రమే శ్వరుతలచేసగల్గుపీఠి నయ్యనిలచెన్
గురు కొట్టుచు హరినిద్రా పరుఁడైతనలోననిట్లు భావించె వెసన్ ॥

శా॥ వీడే యుండుగ నాసహాయమునకై విచ్చేసె యమ్మేటి వి
లోకాడున్ నాహితుఁడర్జునుండు, మానాగారబవున్ బందుగున్
జూడన్ లేనిదిన బు దుర్దినము నెచ్చో ఁబల్చి యున్నాడో కో
రాఁడో నేఁడు కడంబమయ్యెనట విద్రాణుండనై యుండెదన్ ॥

వ॥ అనునెడ పార్థుండు విచ్చేసి

సీ॥ ఎవ్వాని చరణంబు లినజాతరంగస, యుత సైకతముల కంచ్చొత్తి మెరసె
నెవ్వాని చరణముల్ కమవ్యంపుటాలగా, పరినిలంతులకు శాపురములయ్యె
నెవ్వాని చరణముల్ క్రొవ్వు కాళియఫణా, గ్రములందు నటియింప గణికలయ్యె
నెవ్వాని చరణముల్ చివ్వబువ్వయ మొదల్, గలజోదులకు దీపకళికలయ్యె

గీ॥ నట్టి నీపాదముల గంటి నను చుభక్తి కవ్వడి నమించె హరికాళ్ల కట్టుకొనక
నంతసంతోషభరితుడై యచ్యుతుండు లేచి ముందు పార్థుని జూచి పల్కె

ఉ॥ సేమమె ధర్మపుత్రునకు సేమమె భీమునకున్ గవల్ సుఖం
బేమరి కృష్ణకున్ శుభమె మేలె కదా యిక నీకు నైనిక
స్తోమము భద్రమే విమతిసూదన మీ రెపుడైన నాత్మ నా
నామము నుచ్చరింతురె తిరంగ వరుండగ కూడియుండగన్॥

క॥ అని వెన్క కుదిరిగి గనుం గొన కౌరవభువి మ్రొక్కగొని బావా స
కును క్షేమమె యెప్పుడు వచ్చినవాడవో చూడ నైతి చిత్రింబయ్యెన్॥

చ॥ ప్రణుతమనస్కులైన ధృతరాష్ట్రుడు భీష్ముడు ద్రోణుడున్ కృపుం
డును గురుసూతి బాహ్లికుడు మంత్రి కుమారులు కర్ణ సౌబలా
ద్యనుజశతంబు సైంధవ ముఖాప్తులు బాంధవపంక్తి సేమమే
జనవర నీవు వచ్చిన ప్రశంస బయల్పడ జేయవే త్వరన్॥

వ॥ అనిన సుయోధనుం డడుగు క్షేమమేయాసి తనవచ్చినపని యెఱింగించిన
హరి యిట్లనియె

ఉ॥ ముందుగ వచ్చినాడనని మొట్టమొదల్ వచియించినావు నే
ముందుగ పార్థు జూచితిని మోసపుమాటలు గావుగాని నా
కందరు నొక్కరూపరయ నాహవమేనొనరింప జాల నే
నందు వసించియున్న పృథ యొకద చిత్తరుబొమ్మకైవడిన్॥

క॥ నారాయణకంఠీరవ శూరులు పదివేలమంది శుంభద్భల దు
ర్వారులు వారొక భాగము నారయ నేనొక్క భాగ మదివవతంసా॥

వ॥ అని దుర్యోధను నోడంబరచి పార్థున కిట్లనియె.

చ॥ తదుపరి పల్కలేదనకు ధర్మజభీములు నన్ను దూరనాడెదరని
ముందుముందె ప్రకటించితి నీ మదికిష్టమైన య
య్యది గొనుటొప్పు కొంత వడి యాత్మవిచారము జేయు నేనిక
గదనము సేయ దారుగతి కన్పడుచుండెద నమ్ము మర్జునా॥

వ॥ అనిన యర్జునుం డిట్లనియె.

ఉ॥ సంగరరంగమందెదు పరి సంగము సంగతిగోరలేదు నా
ముంగల సారథిత్వమును బూనుటమే పదివేలు కృష్ణ దు
ర్భంగ పరాక్రమంబుగల వానికి సాయమె నేనుకోర్తు మా
తంగ తురంగ సంగత శతాంగ రథాంగయుతారి పంక్తులన్॥

వ॥ దుర్యోధనుం డంత వీరకపటంబు నాకనుకూలమైన దీకృష్ణుండె చాలకని
యా వేళ సేనం గొనిపోయె నర్జునునకు హరి నావలన నీకు ఫలమే
మనవుడు. ఉ॥ అంగజవైరి భూరినిటలాంబకవహ్ని కణంబులట్లు లు
ప్పొంగెడు నాశరాసశరముల్ కురుపుంగవ భంగముల్ భవ
త్సంగతి గల్గియున్న ఘన సంగరరంగ జయాంగవాప్తి ముం
గొంగు పసిండి తంగెడు దగులొత్తు జన్మవిధంబు మాధవా॥

వ॥ భవద్దర్శనార్థంబునకై యుధిష్ఠిరుండు వేచియున్నవాడు రమ్మని
యుభయులు సత్యభామా యుతంబుగ రథారూఢులై విచ్చేసిరంత సం
జయుండు రాయబారియై పాండవులయభిప్రాయం బెరింగి కురుపతికిట్లనియె

ఉ॥ భవ్యత నీవు నాకిచట బల్కిన పల్కులు పొల్లుపోక నా
స్త్రవ్యము వన్నె బెట్టిన విధంబున బల్కితి భూవరా యుధి
ష్ఠిర్యము నందు జేర సభ పాండవులందరు విన్నవారటన్
క్రవ్యభుగంతకుండు హరి నందనుడొక్కెడ పీఠినుండగన్॥

చ॥ హరియును సత్యభామయును నర్జునుడున్ ద్రుపదాత్మజాత న
ల్లు నొకచో రహస్యగతి గోష్ఠిగనుండగ నన్ను జేర బి
ల్చిరియుటకున్ సుతాప్తులను జేరనిచోటు నృపాల నీదెసన్
కరమనురక్తి భక్తినను కౌగిటజేర్చిరి యెంతయో నృప॥

వ॥ తర్వాత నీసందేశోక్తులు బల్కిన విని హరియిట్లనియె

మ॥ ధృతరాష్ట్రక్షితినాథు నోలగమునం దీర్ఘగా జాహ్నవీ
సుత శారద్వత కర్ణ కుంభజ కృపి సూనాది దుర్యోధన
ప్రతివీరుల్వినుచుండ బల్కుమని కోపస్ఫూర్తినై శ్వానగా
న్వితులై ధర్మజుడున్నవాడెవరు గా నీర్ష్యను జల్లార్పగా॥

వ॥ అనినవెంటనె యర్జునుం డుగ్రుడై యిట్లనియె.

శా॥ కౌంతేయాగ్రజు డిష్టమైయనుగు పా లాకేదంచు దుర్యోధన
స్వాంతంబుం డెపు మంచిదేయతను మాకై జేయు యుక్తుల్లా

ద్యుతంబుఁ మెఱుఁగూనుచున్నవి మనో । హంకారవృద్ధిం గదకుఁ
సంతోషంబది నాకు భీమునకు మా । శౌర్యంబు శిద్ధించెనుఁ।

శా॥ ఆదుర్యోధను డాహవాస్త్రగత । శయ్యాంతంబునఁ గూలినం
బోదజ్ఞాతి నివాస భూశయనముం । బొందించు కష్టంబు ప
త్న్యాదాత్త్వవ్రతమూని యాపదల । సంయోగంబు లెక్కింపక
స్త్రైధైన్యంబున లోనడంచుకొనుటల్ । లేవింక మాకన్నడుఁ।

మ॥ అకటా పోవునె మాకు । నాటి వనవాసాయాసకోపాగ్ని బా
ధకమై యెండిన దారులంగలచు । నుద్యద్దావముంబోలి మా
మకశత్రుక్షయ మాతరిం గురువరుల్ । మాయన్న నానాఁడు తె
క్కుడు గైకొందురుగాని యన్నగతి । లక్ష్యంబుంచువారే మముఁ॥

సీ॥ గురుపితామహముఖ్య । చరణంబులకు మ్రొక్కి, మా రాజ్యభాగ సంగ్ర
హణమున, కైవారదము ధర్మగతి । యుద్ధమున, కౌరవులకు సహా
యమ్మై । నిలచువారి, యస్త్రంబులును ప్రతి । హతిము లౌ ననితలం,
చెదము వనావాస । మది మొదలుగ, కష్టంబు లెన్నియో । గడచిన
మమ్ము నిం, దాగ్రహదేవతల । సహాయమూని॥ గీ॥ కౌరవులు గెల్చిరేని
నిక్కముగ మేము । ధర్మమునకంటె యిప్పుడధర్మమే బలంబుగలదంచు
నాత్మదలంచువార । మంతియేకాని మేజేయు నదియులేదు॥

క॥ ముందఱ ముకుందునిడుకొని । యుందుము సిద్ధమ్ములయంబు యుద్ధమునందుఁ
బంధుగులయుతము కౌరవ । బృందము మ్రందించి రాజ్యమేలుట నిజమా

శా॥ గాండీవంబు గదల్చుచున్నదిక నుం । గాండపరీకాండంబు తె
ల్లం డీకొల్పుచునుండు । తూణమున నుండన్నేక చేఖడ్గము
ద్దండాభిలతచే నొరఁ । వెడలు నుద్యద్దీము దండాయుధం
బుండెఁ దాళనిభంబు । కౌరవులజేయుల్గాదు మాకెన్నడుఁ;

వ॥ అని క్రోధావేశంబున బల్కిననిన ధృతరాష్ట్రుండిట్లనియె.

మ॥ రథముం రథ్యములుం శ రాసనము సా । రథ్యంబు తూణీరముం
వృథపోవన్నడు కేతువట్టిదెసుమీ । విశ్వమ్ముతో బోరగా
పృథనంబిందు నెదుర్చు వాడెవడు । కాండవ్యాగ్ర సేనాళితో
సుభద్రావంగలవారికైన నిలువన్ । చోద్యంబగున్ పంజయా।

శా॥ ఆహా యజాకానుడన్న మేన్ పులకరించ । చాభిమానేనుండు తో
డై హేలాగతి వచ్చినంగెలువ । శక్యంబేన యెవ్వారికిన్

సాహంకారతనీవిన బలుకు । వాక్యంబుల్ వృథాజేయు వా
జేహీనోక్తులుగావు వాని । నఁటేడే లోకమందెచ్చటన్ ॥

శా॥ అభీష్ముండును కుంభసంభవుఁడు నం । గాధేయుడున్ గౌతముం
డాఖిలాస్త్రవిదుల్ మహాత్ములని । నిత్యంబాత్మనమ్ముంనవ్వ్రధే
చ్ఛాభూపాలుడు శాంతిజెందిన । మహాసౌఖ్యంబగున్ లేక నే
డేభీమార్జునులోలిరా । కురుబలం బెంతేనిజీవించునే ॥

క॥ అనిధృతరాష్ట్రుడు చింతిం । చెనుపార్థునిని మహీమాపుల చేపొగడిం
పుల్ గొనిపెలిసెడు వివచ్చుం । డనఘుడనవినిల్వ సెవ్వ డవనీస్థలిపై॥

వ॥ యుధిష్ఠిరుండు భీముండు రాయబారంబున కృష్ణున కెన్నియో సందేశం
బులు బల్కిరి తదనుకూలంబుగా కవ్వడి కమలాక్షునకు నిట్లనియె.

క॥ మాయన్నలిఁకవు కేదో । న్యాయంబుగ దెల్పిరాయు దంతముఁరీతిన్
బాయక నేజెప్పెద దే । వా యంతభరించు నాయుపన్యాసోక్తుల్ ॥

సీ॥ శాంబరీద్యూతకాలంబులో । సర్వస్వ: ముపహరించిరి యసూయయు ।
వహించి, సవనాభిజాత కృష్ణా । శిరోజంబుల, బట్టియీడ్చిరి సభా ।
భవనమందు, గర్హణోపేత ము । ష్కరభాషలాడిరి, వనిజేర్చిరెంతే
ని । సెనగలేక, భీకర వ్యాఘ్ర భ । ల్లూకప్రముఖమృగ, లోకంబులో
మేము । నేకగతులు॥ గీ॥ కష్టముల నొందియుంట లోకం బెరుంగు ।
చౌటకేలనోసంగు బీజములరీతి, కౌరవులొనర్చు దుష్కార్య కరణము
లును । చేకురకపోయె శ్రీకృష్ణ నీకృపాప్తి॥

చ॥ క్షితిపయి మేముకష్టముల । జెందినమాట యటుండనిమ్మికన్
గతజల సేతుబంధనము । కౌరవపాండవమైత్రి నేడు నే
గతిదగు నట్టిసంధిగలుగన్ । దలపూను యుధిష్ఠిరుండు మా
రతిశచియించి రాక్రియ । నిరూఢిగమమ్ములగల్పు మాధవా ॥

క॥ సగబాలిమ్మను లేదన । తఱుపనులిడుమనుము లేద ధాన్యముకొల గొ
ల్పుగనిడుమను మదిగాదన । యిగజీవన చెటుల దెల్పుయనుసఫలన్

క॥ ఒప్పించుమి ధృతరాష్ట్రుని । మెప్పించుమి కౌరవులను మేకొనియెటులో
రప్పించుమి మాభాగము । తప్పించు స్వబాంధవుల వధక్రమణంబున్

వ॥ అని బంధునాశనంబునకు వెనుదీసి కౌరవులకల్మషం బెఱిగిన శూరుండై
యుపకారంబు నే యుపయోగించు ధర్మజునాజ్ఞవర్తిల్లుచుండె నంతశాం
తుండో లెక్కింకరా దొకనాడు శాంతనవుండు ధృతరాష్ట్రునకు రథా

తిరథుల నిరూపించుటకో నిట్లనియె.

ఉ॥ సారథిమాధవుండు । పురశాసనదత్త మహాస్త్రసంతతిం గో
త్రారిముఖామరార్జిత మహాశుగముల్ విలు గాండివంబు సా
మీరిధ్వజంబు మార్గణస । మృద్ధి నిషంగము దివ్యభేవ నో
దారరథాబ్జముల్ దగను । ధాభుజుడైన జయుండర్జునుం

క॥ శ్వేతహయంబులు విజయో । పేతంబులు రథము భేద్య విధ దనరారున్
భూతేశుని గెల్చిన పి । ఖ్యాతి బలుండతిరథుండు నర్జునుడెన్నన్॥

వ॥ అని గాంగేయునంతటి మహాత్ముడె శ్లాఘించె భారతయుద్ధంబును సంజయుండు వ్యాసప్రేరితంబుగ ధృతరాష్ట్రున కెరింగించునప్పుడు పార్థుని యుద్ధయాత్ర యిట్లభినుతించె. సీ॥ పద్మరాగప్రభా । పటలంబు వెలెనొప్పు దివ్యరథస్ఫార । దీప్తిరుచులు, తులలేనివజ్రకాం । తులరీతి తులదూగు ఘనరథ్యశారీర । కళలపెంపు, సారమసారవి । స్తారచ్ఛవుల జూపు, సారథిహరిమేని । ఛాయసొగసు: గరుడపచ్చలభాతి । బరగు మహాపరులకు కపికేతన మయూఖ । విపులకాంతి॥ గీ॥ తరకసంబుల జిగజిగి మరకతము లుగ గాగ తాలిమి ధైర్యంబు గడలుకొనగి, నైజగుణములు దృఢముగా రాజిలంగ । విజయుడను కోహనాద్రియు వెడలెనపుడు॥

వ॥ ఇట్లు యుద్ధసన్నద్ధుండై యేగునంత ధర్మజుండు కురుసైన్య భాగవర్తి యగు భీష్ముని యుత్తాలతాలకేతన స్ఫీతకాంతులను కెలంకుల జెలంగు బలంబును గనుంగొని భయభ్రాంతుడై పార్థుం గాంచి యిట్లనియె,

చ॥ సమరమునన్ జయంబగుట । సంశయమయ్యెను ఘోరశౌర్య యో
ధమణులు భీష్మకుంభభవ । ద్రోణకృపుల్ మరి కర్ణదుర్ పరా
క్రమనిధి బాహ్లికుండు । ధృతరాష్ట్రసుతుల్ బలవంతులంత సై
న్యము మనకన్న యెక్కుడుగ దయ్యె । మనోవ్యథ గల్గె తమ్ముడా॥

క॥ అనినిల్చుట కష్టము ని । ల్చిన జయముఘటగ్భశంబజేయులు కురురా
జ్జనములు నన దరహాసితా । ననుడై యిట్లనియె నింద్రనందనుడపుడున్॥

చ॥ తెలియవు భీమసేనుని । దృఢిన్ జితతమ్ముల శౌర్యయుక్తి మ
ద్వలసిత శస్త్రలాఘవము । విక్రమశక్తి ఘటోత్కచాభిమ
న్యుల శరసాధనంబు । సుమనోవరుడైన జనించు నీభుజా
బలము నలంతియే త్రిదశ । వర్గము బెగ్గిలకున్న నిన్గనన్॥

శా॥ జెండాపై కపిరాజు కూబరమునన్ శ్రీకృష్ణదేవుండు వ

ఖాండోత్తంసములుగా । రథంబునకు చేతగా రాశవృక్షంబనగా
గాండీవంబు నభేద్య కార్ముకము । నక్షయ్యంబు తూణీర మి
ట్లుండగా నీకృప శౌరి పేర్మిగ లుగగా । యుద్ధంబు సాధ్యంబగుగా॥
ఉ॥ నారదుఁడొక్కనాఁడు ఘట । నందనభీష్మకృపుల్వినంగ నా
తోరహిఁనిట్లుబల్కె విను । దుర్మద ధర్మవిదూరులౌ ద్విష
ద్వారము సైన్య యుక్తముగ । దప్పక దృంతువటంచు బల్కె నీ
కౌరవులెందఱున్న భయ । కంపిత వృత్తిని మానుమగ్రజా।
క॥ చక్రము గాండీవాహికి ॥ తెక్కలు వచ్చినవిధంబు ద్రిమ్మరుచుండెగా
చక్కగ నేనలిగినయొక । తెక్కయు యీబలము మదిచలింపకుమన్నా
వ॥ అని ధర్మజునకు సాహసంబు, ధైర్యంబును, సంతోషంబును గల్పించె
యాసవ్యసాచి శౌర్యంబు నవార్యంబు యుధిష్ఠిరుండా యోధాగ్రేసరు
యుపదేశంబునకు సుస్థిరుండై యుండె పార్థుని బలనిరూపణ మభివర్ణ
నీయంబు మరియును పదకొండక్షౌహిణుల బలంబు కౌరవులకు. నేడ
క్షౌహిణుల బలంబు పాండవులకు నుభయ సేనాధిపతులు గాంగేయ
దృష్టద్యుమ్ను లిట్లు కురుక్షేత్రంబున కేక్కరిసియుండి రంత

—( ద్వితీయాశ్వాసాంతము )—

మ॥ కరుణాసాగర మానసాం । బురుహా వెంగారాయ సత్కీర్తిగా బం
ధురదావళ్ళ రుచిప్రదీపిత । దిశాస్త్రీకాంత రాకాకవీ
శ్వరమందార కుజోపమానగుణ । శుంభద్రాజకీయ ప్రచా
రరతా భారతపత్కథామృత సు । ధారాస్వీత పీతాత్మకా॥
క॥ మహితనిజాంశభు మానిత । విహితపరీతిభా ధురీణ వీరవతంసా
సహజవిజ్ఞారస ఘూ । ర్వమాగుణ బుచ్ఛన్నభూప బలసంధీపా॥
తోటక వృత్తము॥ పూసుకూరు కుల । పుణ్యచరిత్రా । భాసమాన గుణ ।
పంకజమిత్రా। ధీసమగ్రశ్మరదీపితగాత్రా। భూసురామర సుపూజనపాత్రా॥
గద్య. ఇది లక్ష్మీనృసింహ దేవతా ప్రసాదలబ్ధకవితా విచిత్రాత్రేయగోత్ర
జగ్గమరాజపౌత్ర సుందరరాజాగ్రపుత్త్రాంబటి లక్ష్మీనృసింహరాజ
ప్రణీతంబైన యర్జునాభ్యుదయనామాంతర విజయవిజయంబు
నందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీశుభమస్తు

# విజయవిజయము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీరాజేశ్వరరాయ వ । రారంగారాయ చొక్కరాయ జగన్నా
థారాయాధిప గౌతమ । తీరపురాంతర విహార ధీరోదారా॥

వ॥ అవధరింపుము శుకశౌనకాదులకు సూతుండిట్లనియె కురుక్షేత్రంబున కు
రుపాండవులుండు నంత

—( బంధుప్రేమ. )—

క॥ యుద్ధము జేయుటకై స । న్నద్ధుండై వచ్చి హిత జనంబగుటయు తా
బుద్ధిం దెలిసి విషాదని । బద్ధుండై నిలచు నరుని ప్రక్రియ వినడీ॥

సీ॥ వేదండరాజ శుండాదండ ఫూత్కార । ముగ్రఘీంకారంబు లొక్కచోట
గంధసైంధవబృంద గతిపంచక విహార । ముదిత హేషాధ్వను లొక్కచోట
ధవళాయుధచమూ వితానకోలాహలం బు । త్సాహ జయఘోష లొ
క్కచోట, రథకేతనకళాకర శదీధితియం । బుల్లాసరధిశ ధ్వ్య లొ
క్కచోట, క్రిక్కిరిసియుండగా కురుక్షేత్రమందు । కౌరవులు పాండవు
లు గుమిగావసింప, మధ్యరంగంబునం దురమాధవుండు । స్యందనము
నిల్పి యాసవ్యసాచిజూచి॥

శా॥ పార్థా నీవటు జూడు కౌరవబలవ్రాతంబు తీతంబుగా
నర్థిన్ యుద్ధపరిక్రియా । పటిమనిక్కై వేచి చూపట్టెనీ
వర్ధిష్ణుప్రతిభా ధురంధరతనీ । పాండిత్యముం జూపు ప్ర
త్యర్థుల్ బెగ్గిలినాటి । ఘోరవన వాసాయాసముల్ దీరగన్॥

క॥ అనియుత్సాహంబుగ బ । ల్కిన పక్షిధ్వజుని వంక జూచి కెలకుల నిజ బం
ధుని కాయము గనుగొని తన । మనము విషాదంబునొంద మాన్పడఁ బలికెన్

మ॥ వికలంబయ్యె మనంబు వీఁగనగా । విద్వేషి మైలోభియై
యకటా దుష్టసుయోధనుండు । సమరవ్యాపారముల్ జూనె వా
నికి బుద్ధిన్ గలిగింప లేరైరి । పోసి తుచ్ఛ రాజ్యాశచే
సకలాప్తపరికరంబు బోనడతునే । స్వామీ జగద్రక్షకా॥

సీ॥ బంధుబంధురమైన । భాండనంబున నిల్వ, గాజాలతను వెల్లు కంపమొందె
దృఢముష్టియందు సంధించిన చాపగాం, డీవంబు నాచేత । నిల్వకుండె

నేవంక జూచిన హితబాంధవులుగదా కన్నీరు మున్నీరు గాదొడంగె
క్షణభంగురంబైన సంపద్విషయకాంక్ష లాత్మఁ జేరుటకు నిరాశఁ జెందె
నలభగీరథసగరమాంధాతృభరత రఘుదిలీపపురూరవ రామనహుష
శంతనులు వింతశిబి సుమంతమైన గట్టికొనిపోయి రేచను కాలమందు॥

ఉ॥ ఇందఱు నాజిలోన వధి యించియు నేనిక యెన్నినాళ్లు భూ
మిం డిరమై వసింతు నిజ మే క్షణభంగుర మైన దేహముల్
బంధుగులందఱుం సమర భాగమునం బడి యుండ నాకు మే
లుం డిరమౌను యెన్నిశిశు లుం దనగారిన సౌఖ్యముండునే ॥

చ॥ తనయులు తమ్ములగ్రజులు తాతలు మామలు బావలుం గురుల్
ఘనులు మధిష్ఠశిష్ట జన కాండము డుల్చిన వారికాంత లె
ల్లనునను బ్బృంగ దిట్టరె కులక్ష్న తనిందయు గాదె వంశ నా
శన మొనరించి యేబడయు సౌఖ్యము ముఖ్య మదేమి మాధవా ॥

వ॥ అని పరితపించు నక్కురుణామయుం జూచి హరి యిట్లనియె.

క॥ ఈయవివేకము కిరీటికి హేయంబగుగతి జనంబు లీహేయనగా
నీయూడుదనము పిరికియు నీయెడజనియించె చిత్రమిది దలపోయన్॥

వ॥ పరిపంధుల భండనంబున బడవై చెను బలంబున సాజ్య సామ్రాజ్యంబు బడయుట నీధర్మంబుగాని ధైర్యంబువదలుట దర్పంబుగాదనిన యర్జు నుండిట్లనియె

సీ॥ చిననాటనుండిబెం చెనుతండ్రి భీష్ము నిజంపనెట్లకో వనజనాభ
పుత్రునికన్నపెం పుగ కూర్మి జూపు కుం భజునిగూల్చుటయెట్లు పరమ
పురుష, చిరమైత్రిగనుపించు గురుపుత్రుకృపుని పా యకదుంచు
టెట్లు దేవకీకుమార, తల్లితోబుట్టువం తటియా ప్రుడేశిశ ల్యునిదెగ
టాచుటెట్లనఘ చరిత, గీ॥ బికిరమెత్తి సుఖించుట ప్రియముగాదె
చూడువారంత గాంధారి సుతశతంబు, నుభయసైన్యంబునష్టంబు యుద్ధ
మందు, కరమునుచివరకు వర్ణసంకరము కృష్ణా ॥

వ॥ నేను కార్పణ్య దోషోపహత స్వభావంబున ధర్మసంమూఢ హృదయుం డనై నిన్ను శరణంబువేడి యడుగుచుంటి నీశిష్యుండనగు నన్ను శాసింపు మరదంబు ద్రిప్పు మీానెత్తుట జొత్తిల్లిన విత్తనంబునకు నాచిత్తంబు బోరయకున్నదనిన హరి చిరునగవున నరునకిట్లనియె.

ఉ॥ నీవునిమిత్త మాత్రమున నింట్రటగాని మదొంకుజేయుగా

లేవు వధింప బోవిలువ । లేశము నెవ్వఁడగుఁ సమర్థుఁడా
దేవుఁడు దప్ప జీవముల । దేహములం బురికొల్పు వెంటనే
జీవుల మార్పు జేయునెడ । సేయక కర్మ విపాక హేతువై ।
క॥ మరి తత్వం బెఱింగెద । పరగ కృతాకృత శుభాశుభంబుల చేతన్
బొరలును భూతచయంబు సక్రమధర్మము నీకు మంచిమార్గము పార్థా
క॥ నాలుగు వర్ణంబులకును । నాలుగు ధర్మములు దగు గుణంబుల చేతన్
నాలో నిర్మితమయ్యెను । కాలోచితకర్మగడప గలరిల ప్రాజ్ఞుల్ ।
వ॥ వినుము నీకు వేదాంతవిషయం బుపదేశించెద పెద్దల సేవ లేమిం జేసి విషాదయోగంబున యున్నవాడవని గీతలుపదేశించి విశ్వరూపంబు జూపించి ప్రసన్నుండైన యర్జునుండు,
శా॥ బావా నీవాక యాదవుండ వనుచున్ । బంధుండవంచున్ సదా
సేవింపన్ దలపూని యుంటిమిగదా । చిత్రంబు నీ విశ్వ రూ
పావిర్భావము నీవు లేనిది స్థలం । బావంతయున్ లేదు గాం
డీవంబూనెద రథ్యముల్ నడుపు । మన్నింపందగున్ మాధవా॥
క॥ హర్తవు కర్తవు భర్తవు । మూర్తిత్రయమందు నాదిపురుషుఁడవు కళా
మూర్తివి స్ఫూర్తివి సం । పూర్తివి విశ్వంబునందు పుణ్యచరిత్రా॥
క॥ పదునాల్గు లోకముల నీ । యుదరంబున జూపితివి మహోదయ నాకున్
మదిమొదలు దెలియదాయెను । గద మేఘవు కాలిగ జగతి గనిపించెన్
వ॥ దేవా నీవిచ్చిన దివ్యదృష్టి ప్రభావంబున నిఖిలం బెఱింగితి నని విడిచిన విల్లు నమ్ముల మరలధరించి కృష్ణా మనరథం బామధ్యరంగంబునకు బోనిమ్మని సేనకున్ముఖుండై నిలచెనంత.

—( గురుపూజ )—

శా॥ సేనాబృందము గొల్వ । పార్థుఁడు కురుక్షేత్రంబునం దున్ నదీ
సూనున్ ద్రోణుని నాకృపున్ । గని మనస్స్ఫూర్తిన్ శరప్రాహాసం
ధానం బేర్పడ పాదసన్నిధిని । కర్ణ స్థానముం జేరు వ
ట్లైనాగ్లేసి మయూఖముల్ । బరపె నోలిన్భక్తి యోగంబునన్॥
వ॥ ఇట్లు ప్రణామపూర్వక కుశలప్రశ్నంబుగా తన శిష్యభావం బేర్పరించిన గురు శాంతనవులు సంతసించి శ్లాఘింపదొడంగిరి.
గీ॥ ఘనుఁడు శత్రుంజయుఁడు చిరకాలమునకు । గంటిమితని కిసాటి లోకమున గలరె
నయగుణుఁడు సజ్జనులకు బాంధవ హితులకు । ప్రియుఁడు వీనికి నని యప

జయముగలదే।

ఉ॥ కాల్చెను ఖాండవంబును నగాధపయోధిని కాలకేయులన్
గూల్చెను కిన్నరామరముఖుల్ గొనియాడ సురేంద్రుపీఠిపై
నిల్చెను మాయబోయ రజనీచరమాళిని నాహవంబులో
గెల్చెను దేవకీసుతు సఖిత్వముగాంచె సభేద్యుడేరికిన్ ॥

వ॥ ఇట్లు నభినందించినంత నరుండు వారలకిట్లనియె,

సీ॥ పదరానియిడుములన్ గుడచి కారడవులన్ రీతితప్పక సంచరించినాము
సమరంబుజేయగా సమయంబటంచు మెంచియిప్పుడు సమీపించి
నాము, యలుకజూనకవి పన్నులమైన మా యెడ కూర్మిజూపుమటంచు
గోరినాము, తండ్రులవలె మీరు తనయులవలె మేము నిడుగాని న్నా
ళ్లు లుండినాము, తోలుత మిమ్మెరయుమనిమది దలచినాము, మీరు
మునుముందుగోరుట గోరినాము, తెలివితేటల మిమ్ము ప్రార్థించి
నాము, నేడుమీయాజ్ఞకై యిట నిలిచినాము ॥

వ॥ అని వినేయుండై నిలచిన భీష్మద్రోణులు హాసన్ముఖులై యిరువదిరువది
కగుకటమ్ముల బరపిన పార్థుండు తత్క్షణంబున భగ్నంబుగావించి కో
పంబున సందీపితుండై ప్రతాపంబు జూపింప దొడంగెనంత.

ఉ॥ పాండవకౌరవుల్ గలసి భండనముం బొనరించుచుండి రు
ద్దండతసవ్యసాచిబల దర్పములేగ్పడ భీష్ముజేరి మా
ర్తాండునిరీతి వేడిమి బ యల్పడజొరుచు నుండె దేవతా
మండలమెల్ల వారల న మగ్రిత విక్రమ మెంచి రాత్మలో ॥

క॥ పృథులబలోగ్రులు నగునతి రథులుమహా రథులుసర్థ రథులుసమ
రథుల్ రథగతులలరజయమనో రథులైపోరాడుచుండి రాణించరొగిన్

వ॥ శవరక్తపూరితంబై కురుక్షేత్రంబు వెలుంగుచుండెనంత. (సమయనిష్ఠ)

క॥ శాంతనవుడుగ్రత (శ్రీ) శాంతునినర్జునుని బాణఘాతలొనర్పన్
ద్రుంతునననిదుమునుకౌని శాంకిన్ నెలకొల్పెమాట సత్యముకారకై॥

దండకము:— ఆభీష్ముడున్ పార్థుని దుగ్రాకృతుల్ బూని కాండప్ర
కాండప్రచండప్రయోగంబు సాధించుచున్ యోధబృందంబుపై శస్త్రధా
రల్ మునింగింప గాంగేయుడాభీల బాణంబు శ్రీకృష్ణు వక్షంబునాటన్ శరీరం
బుదూలన్ శితాస్త్రంబులేయన్ మరున్నాథపుత్రుండు గంగాకుమారున్
వడిన్ జేరవేకున్కి దామోదరుండా పగాసూనుపై కోపరూపంబునన్ చక్ర

ముఁ దాల్చి యోయర్జునా వీని మూలంబునఁ గౌరవేంద్రుండు రాజ్యం
బు నేలఁ జయంబు గాను చందంబు గావించుచున్నాఁడు వీనిం జయించంగ నీ
చేతఁ గానట్టులఁ దోఁచె దేవవ్రతుఁ గూల్చి ద్రోణునిన్ మృతునిఁ జేసి కౌరవ్యు
లఁ నేలపాల్జేసి మీ యన్నకుఁ రాజ్య పట్టాభిషేకంబు గావింతు నంచుఁ
త్వరఁ బగ్గముల్ కూబరంబందు బాధించి మాద్యత్కరీంద్రంబుపై సింహ
డింబంబు లంఘించు చందంబునఁ జేరి యా భీష్మునిన్ జంప నుంకించ భీభత్సు
డుఁ బీతి నిండారఁ గృష్ణా ముకుందా ననుఁ జూచి శాంతింపు శాంతింపు నీవా
యుధంబు గాననంచుఁ బ్రతిజ్ఞ నీ వబ్బఁ బూని దోర్విక్రమక్రియన్ చక్రముఁ
బూన ధర్మంబు గాదయ్య లోకంబు నిందించు కుంతీ కుమారాగ్రజుం డెంతో
సంతాపముం జెందు తద్ధైర్య శౌర్యంబులుం హీనమౌ నంచు వెన్నంటి హాం
పోత్తరీయంబు చేలాగుచుండఁ ననుఁ వీడు వీ డెంతవాఁ డంచు బో బోవ రార
మ్మా లేలెమ్మా నాకంతయుఁ దీయ లేకుంటివా సర్వలోకాళిలో నీకు చీకాకు
గావింతు నంచుఁ నదీసూనుఁ డాసఁ నభోమండలిన్ దేవ తావగఁ బూచిత్ర
ముఁ జూడఁగా కౌరవుల్ పాండవుల్ నేఁడు భీష్ముండు చక్రిహతిం గూలు నం
చుఁ భయ భ్రాంతులై చూడఁగా మందహాసంబుగా మీ పముఁ దీటుచుఁ
భీష్ముఁ రుద్రోకుఁడై బిల్వగా ప్రార్థనల్ జేయుచుఁ పార్థుఁడాస్యందన స్థా
నముఁ జేర్చి యో దేవ నీ కోప రూపంబు జూపింప రూపింపకఁ రథ్యముల
ద్రోలు యుగ్మంబులఁ బూని శౌరీ నమస్తే నమస్తే నమస్తే నమః.

ఉ॥ కౌరవులఁ జయింతు ; తృటి కాలము నీకృప గల్గెనేని దు
ర్వారపరాక్రమ స్ఫురణ ; వధ్యులఁ జేయుదు జూచుచుండు నీ
సారథికృత్య మేమి యొనె ; సంగరమందుఁ గోపమేల నీ
వీరణమందు శస్త్రము ; ధరించ నటంటివి గాదె మాధవా ;

శా॥ నీవే ధర్మము దప్పియున్న యెడ వా ; ణీనాథ సృష్టిక్రియా
భావం బెల్లహుళిక్కిగాదె విధుమఁ ; భానుండు ద్యోమార్గమం
దేవంకఁ జరియించువారు త్రిదశుల్ ; హీనాత్ములుం గారె పే
రావేశంబది యేల మా యాశము ; దేవా వధ్యులఁ జేయవే ॥

వ॥ అని యొడంబరచిన కృష్ణుండు సవ్యసాచి సమయు నిష్ఠకు సంతసించి రో
షంబుడుపుకొని పాంచజన్యంబు పూరించె విజయుండు గాండీవగుణధ్వని
గావించి దేవదత్తంబు నొత్తెను భయసైన్యంబులు బెనంగుచుండె భీష్ముం
డు ప్రచండుఁడై భండనంబొనరింప బెండుపడి హరియిట్లనియె.

శా॥ ఓపార్థా యిటుజూడు । భీష్ముని రణోద్యోగంబు దండార్భ బా
హాపాండిత్యము బాణలాఘవము । వీరావేశమత్యంతమై
దీపించెన్ మనసేనలన్ । దిగులుబొందించెన్ వృధావిక్రమ
వ్యాపారంబుననున్న వాడటూ । భామోహమానుండవై

క॥ కడుకరుకుతనం బెక్కెం । చెడుమాటలువిననొనర్చె శ్రీకృష్ణుడు క
వ్వడిని పురికొల్పగా నా । తడు భీష్ముని మార్కొనెన్ త్రిదశులగ్గింపన్

వ॥ అంత శాంతనవుండు కౌరవకాంతున కాకాంతేయునింజూపుచు చింతా
క్రాంతుండై యిట్లనియె.

క॥ ఈయర్జునుతో బోరగ । నాయమరాదులకు శక్యమాదలపోయన్
జేయంగలయత్నము వెను । దీయక జేసితిని జూచితే కురునాథా॥

క॥ కాండప్రకాండములను శి । ఖండియునాపైన గుప్పె గనుగొనుమదిగో
గాండీవి యఖండాయుధ । మండలమున నొచ్చితిన్ సమరభాగమునన్

వ॥ ఇట్లుబల్కి వెండియు భండనం బొనరింపుచుండ శిఖండి కారణంబున
కాలవిపర్యయంబున చిక్కుపడియె నమరులు సుమవర్షంబు గురిపించి
రంత రణంబు జాలించిరి.

క॥ ఖగతుండై పార్థుడు కో । పగతుండై గెల్వ నాహవంబున శరత
ల్పగతుండయ్యెను మరితా । పగతుండై పడియె గంగపట్టి సిలుగులన్

వ॥ తూణతూణంబునకు రణవ్రణబాధితుండై తాపమాపక నాపగాతనయుండు
రసాతలోదకంబు గావలయునన్న కౌరవులు వెనుదీసి తమతమ మొగం
బులు జూచికొనుచుండ నంత కుంతీసుత మధ్యముండు,

మ॥ పతగేంద్రజ సత్నుకర్తెరిగి తా । పర్జన్యమంత్రాబిమం
త్రితుడై ఘోరశరప్రయోగము న । కుంఠీభూతుడై జేయ భూ
గతపాథస్స్రవిహారూపకముగా । గస్పష్టి నాజాహ్నవీ
సుతుడానీరము ద్రావి యందఱువినన్ । స్తోత్రించె నప్పార్థునిన్॥

చ॥ ఇరువదియొక్కమారు పుడ । మీశుల దుంచిన భార్గవున్ జయ
స్ఫురణవహించి గెల్చె నది । పుత్రుని బోరజయించె క్రీడికిన్
సరిగలడేజగంబున విశాంపతు । లెవ్వరటంచు ఖేచరుల్
బరువడి లెన్న సాగిరి శుభప్రతి । పాదన వాదనంబులన్॥

క॥ పదిదినములుబోరి బలా । భ్యుదయము నిండార గంగపుత్రుడు బడగా
ముదమున ధనురాచార్యుడు । పదపడి కురుసేనకెల్ల పాలకుడయ్యెన్॥

వ॥ తదనంతరంబున జరిగిన కదన ప్రచారంబు వినవలయు.

—( ప్రతిజ్ఞా పరిపాలనము )—

క॥ రవి గ్రుంకకముందర సైంధవు ద్రుంతునటంచు ప్రతిన నరుడూనియు నా
హవమున నటులొనరించెను దివిజౌఘ మహాయటవిను తింపుచునుండన్

గీ॥ కుంభభవ ప్రదంత నాశాత కుంభకుంభ - జలము చేనభిషిక్తుడై యలరి కౌర
వేంద్రుగని నీకువరమెద్ది యేనిగాని - యడుగుమనుటయు యోచించి పుడమి రేడు

ఉ॥ పాండవులన్ వధించుతఱి - పంకజనేత్రుడు చక్రధారియై
యుండి జయించుమమ్ము - పృథకు ద్వినాసంగును శౌరిపక్క మొ
క్కండ నినుండ ధర్మజుని కట్టిటు - దెమ్మట జూదమాడి హీ
నుండగునట్లు జేసెదజనున్ మరి - పూర్వపు రీతి కానకున్॥

గీ॥ ధర్మజుడుబోవ వెనువెంట తమ్ములెల్ల - నేగువారు తదాజ్ఞ వహింత్రుగాదె
దీనిమించును పాయమెద్దేని గలదు - వరము నిదియె ప్రసాదించు గురువరేణ్య

వ॥ అనిన గురుండిట్లనియె.

గీ॥ అర్జునుడు లేనిపట్ల నయ్యమతనూజు - బట్టిబంధించి నీచెంత బెట్టువాడ
గాని యాతడుండినన్ గిరకంతుడైన - వేరుజూపింపలేడు పృథ్వీతలేంద్ర

వ॥ అనిరొయిడంబరచె నాయుధంతం బంత నాంగి యంతకసుతుండు చింతా
కులితస్వాంతుండై సుభద్రాకాంతున కిట్లనియె.

ఉ॥ నన్ను గురుండుబట్టి కురు - నాథున కిచ్చునటన్న వార్త నే
విన్న ననున్ త్యజించి చనుటు - వెళ్లకుమన్న ప్రసన్నవృత్తి నీ
కన్న మఱొండుకున్న కల - గన్నవిధంబిటు దోచె నన్న యో
యన్న యిదంత విన్న దిన - యన్నవచించెను యున్నసంగతుల్॥

వ॥ అనిన యర్జునుం డన్నకిట్లనియె.

ఉ॥ చుక్కలు రాలనీ మిహిర - సోములయానము మాననీ ధరా
చక్కలు గూలనీ జలనిధిన్ బడబాగ్ని యడగనీ సుధా
భుక్కులు సోలనీ సమర - భూమిని భీముడు నేను నిల్వ నీ
దిక్కరవంత వచ్చి యట - దేరికనుంగొన సత్తుడెవ్వడో॥

వ॥ వినుము విశ్వంభర విశ్వేశ్వర విష్ణుపత్రయ లోకానీకం బేకంబై వచ్చిన
నిన్నొరుల కిచ్చువాడే వ్వచ్చుండని బాసటయై నిలచి తమ నదీంచిన
ద్రోణుని మార్గానసంత హాతశేషులగు సంశప్తకులు దలపడ నుంకించిన
ధనంజయుడు ధర్మజున కిట్లనియె.

క॥ రమ్మనిసమరమ్మునకు మ । దమ్మున సంశప్తకులు పడంపడినను వే
గమ్మున బిలచిరదేగను । పొమ్మని సెలవీయవే సుపుణ్యచరిత్రా॥

వ॥ అని తదాజ్ఞవహించి సమరాంగనంబున సంశప్తకుల సమవర్తిపురాతిథుల గావించి విజృంభించుచుండెనంత భగదత్తుండు మాయావియై మత్తమాతంగంబునెక్కి పాండవసైన్యంబును దైన్యంబునొందించుచు వాల్లకల్లోలంబు గావించుచుండ గాండీవి గంధసింధురంబుతో వానింగూల్చి కౌరవులతో బోరుచుండెనంత.

క॥ సాహసముప్పగ ద్రోణుం । డాహవ దోహళపరాక్రమాభీలజయోత్సాహుండై ఘనపద్మ । వ్యూహము బంధించె ధర్మపుత్రునిబట్టన్॥

సీ॥ ఒకవంకనాచార్యు డుత్సాహియై యుధిః పిరుబట్టుటకును యోచింపుచుండ, నొకవంక కర్ణాది । యోధవీరులు బలాన్వితసైన్యములు భీకరముగ నిల్వ, నొకవంక సైంధవుం డుగ్రప్రతాప సంకలితుడై ద్వార । భాగమున జేర, నొకవంక బాహ్లిక । శకునిభూరిశ్రవ, ధార్తరాష్ట్రులు మహోద్ధతివసింప॥ గీ॥ దనగునత్తమ్మి యొగ్గరంబునకుధర్మనందనుడు దోలగా పార్థనందనుండు, సింహశాబకమా కరిసేనజొచ్చు కరణి వ్యూహంబుజొచ్చి చికాకొనర్చె.

ఉ॥ ఒకడొకడుర్వి సోలుచు ప । యోధితరంగములట్లు పంక్తి భా
యకమ్ముత జెందుచుండిరి । సహస్రశతంబుల లెక్కదాక క
ర్షకుడు లవిత్రహస్తమున । సస్యముగోసి మొదలవిధించు పో
లికబడుచుండె కాండశిలీ । కృతయోధక బంధ బృందముల్॥

ఉ॥ పాండవబాలవీరుడు విభాకరు । భాతివెలుంగుచుండి యొ
క్కండునఖండసేనల చికా । కొనరింప నెదిర్పలేక ద్రో
ణుండు కృపుండు కర్ణుడు గ । నుంగొనకుండ నధర్మవృత్తి శూ
రుండభిమన్యు గూల్చిరి । కురుపక్షకిరంబు ముదంబుజెందగా॥

వ॥ అంత కౌరవసేనాసమూహంబుల సింహనాదంబులుజెలంగె కృష్ణార్జునులు శిబిరాభిముఖులై వచ్చుచుండ పాండవ బలంబులు విశాదంబున విముఖులై పోవన్ జూచి నరుండు హరికిట్లనియె.

సీ॥ వందిమాగధులకై । వారములు పటహాది, వేణునిస్సానముల్ । వినగరావు, ధర్మజాదుల గృహాం । తర్భాగచారులు, నిఖిలాయుధంబుల । నిలచిలేదు, క్రోశప్రదేశ మొ । క్కడు జవంబుగవచ్చు: నేలకో యభి

మన్న్యఁ డెదురురాఁడు, నామానసంబు చింతాభారమయ్యెడే. నా యొక్కమాటైన బలుకరాదు, గీ॥ కాలవిధిచేత యేదోవికారమొంద వె ధర్మజుడు పట్టుబడెనో కో తమ్ముఁ డుగ్ర, లకువిపర్యాసమొక్కొ తె ల్పపుగదయ్యె శ్రీధరా యేవాచ్యంబు చెవినిఁబడునో॥

క॥ ఏమాటాడిన బల్కవ దేమో కారణముదెల్ప వేమాధవ సం
గ్రామస్థలిని పరాభవ మోమరణమొ గొనిరియెవ్వరో మనవారల్ ।

వ॥ అని చింతించుచున్న విషాదవివశుండగు విభ్వచ్చునకు కృష్ణుండిట్లనియె.

క॥ నీయన్నలకును తమ్ముల కేయపజయమొదవదయ్యె యేదోదుఃఖో
పాయముగల్గెను శూరుడ వైయొటుజింతింపభావ్య మానీమదికిన్ ॥

గీ॥ కాగలపనుల్ నిజంబుగా గల్గుచుండు విధికృతంబునెవ్వడు తప్పింపగలడు
సుఖముదుఃఖము దేహికి సులభగతము చింతనొందుటతగునె నీయంతవాడు

వ॥ అని సర్వజ్ఞుండైన కృష్ణుండు పరిమితవాక్యంబుల నుపదేశించి నిజశిబిర ప్రాంతంబుల కేతెంచి యర్జునుండచ్చట నభిమన్యుండు దక్కతక్కిన వారింజూచి వెక్కసంబుగా నిట్లనియె.

క॥ నాముద్దుబిడ్డడిటు లే డామాటేమైనబల్క రావ్యూహపు సం
గ్రామంబునబడెనాయత డామార్గము నెరుగడక్కటా చెడుగయ్యెన్

చ॥ ననుగని పల్కబోరు వదనంబుల నెత్తరు పాపమేమి నా
గోనముల దొంతియైన కొడుకున్ గనకున్న రణంబదేల జీ
వనమిదియేల రాజ్య విభవస్థితులేల నిజంబు బల్కరే
కనులకుజూపకున్న క్షణకాలము నేబ్రతుకంగ నేర్తునే॥

చ॥ గురువిభయంబుజిక్క కొడుకున్ బ్రతిమాలియు నేడు తమ్మిమొ
గ్గరమున కంపినారు కృప కర్ణ జయద్రథ కుంభజాది దు
శ్చరితులచేత జిక్కెనొ నిజంబుగ నొక్కని కేలజిక్క భీ
కరభుజ శౌర్యధుర్యుడు నఖండపరాక్రమ ధుర్యుడక్కటా॥

క॥ పోనేర్పు వ్యూహమునకున్ రానేరడు గుర్తెరుంగ రానెనువెంటన్
సేనలతో మీరరుగక నేనిల్చితిరే మి కాల్పనే మీబలముల్ ।

చ॥ హరికిని మేనయల్లుడు మహాత్ముడు వేలుపురేని మన్మడు
త్తరశశిరేఖనోచిన నిధానము పాండవ యాదవాన్వయ
స్థిరమగుజీవగర్ర వెనుడీయని పోటరి బంటుసుందర
స్మరుడు సుభద్రకూరిమి కొమారుడునారత నాలదీవియున్ ।

వ॥ అని విలపించుచు పరితపించి రథంబుడిగ్గి సతికేలంబడిన ధర్మజుండు శోకించుచు గద్గదస్వరంబున నిట్లనియె.

ఉ॥ చేరగలాడటంచునతి చే యశోతాంగము నొక్కి వ్యూహమున్
చేరను మేము వెంట తగుసేనలతో జన సైంధవుండు త
ద్ద్వారమునందు నడ్డుపడె నాత్మజుడొక్కడు గెల్చెనందరిన్
గౌరవులున్ దురూహాలచి కాకొనరించి వధించిరర్జునా॥

గీ॥ అరుగుచో సైంధవుండు మాకడ్డపడుట యొక్క డాతమ్మి మొనయందు జిక్కుబడుట, వేగ గురుకర్ణ కృపులచే విరథుడగుట మనల నెడబాసి చనె నభిమన్యుడకట॥ వ॥ అనివిన్నవించిన విన్వచ్చుండు వివశుండై యభిమన్యుని మారణంబునకు సైంధవుండు కారణుండని తలపోసి రోషావేశంబున నందరువిన నిట్లనియె.

మ॥ భవునిన్ శ్రీధవునిన్ పయోజభవునిన్ పాకాహితున్ ధర్మజుం
డివిజశ్రేణిని వేడి కావుమనినన్ దిక్పాలురందేగినన్
రవితాగ్రుంకకమున్న రేపట ధనంజయముక్త బాణంబునన్
బవరంబందున సైంధవుం దునిమి శుంభన్మూర్ధమున్ ద్రెంచెదన్॥

చ॥ జని యిటుజేయకున్న పశు నంగన భూసుర వృద్ధ బాల జం
పినగతి మద్యపాను పర విత్తహరుం గురుతల్పభోగు జెం
దినస్థితి నన్ను బొందు నది నిక్కము నిక్కమిదొక్కమాట నే
ననలము జొచ్చెదన్ త్రిదశు లడ్డము వచ్చిన గాండివంబుతో॥

వ॥ మరియు మాతాపితరుల గతులకుం దప్పినవాడనగుదు నని ప్రతిజ్ఞ నవలంబించిన తద్వార్తాకర్ణనుండై సైంధవుండు కురురాజుం జేరి యిట్లనియె

శా॥ ద్వారంబందున నిల్చి వారలకు పద్మవ్యూహ మార్గంబునం
జేరన్ జేయని కారణంబున సునాశీరాత్మజుం డక్కటా
క్రూరుండై నను రేపు చంపునట నాకుందిక్కు లేదా మహో
దారుండాతని మార్కొనన్ గలనె నా ధైర్యంబు బోజేయవే॥

మ॥ పదియుండొక్కటియై యధర్మమున జంపంజూచిరే కాని నే
నుదరిన్ దాపున జేరలేదు యభిమన్యున్ మార్కొనన్ లేక నా
రదె ద్రోణుండును కర్ణుడుం కృపుడు యాశ్వత్థాముండు దుస్సహా
పదలం బెట్టిరి గాని నన్నతడు జంపన్ పాపమేమీ నృపా॥

వ॥ అనిశోకవ్యాకులుండై పలికిన కురువల్లభుండు గురునకెఱింగించి యిట్లనియె

క॥ రవిగ్రుంకెడులోపల సైంధవుదునిమెదనంచు వ్రేసిన తాదాల్చెను వా
సవిఫీని జావకుండగ § బవరంబున నేలు కార్యభారము గొనవే॥

వ॥ అని బ్రతిమాలిన గురుండు నాప్రాణంబు లుండుదాక యాస్థానుండైన
నెదురించునే నాపాలింగల ప్రాణంబు లల్పంబులుంగావు పాండవ మధ్య
మాని ప్రతిజ్ఞాభంగం బొనరించి నిన్నురక్షించెద సైంధవాయుని వెన్ను
తట్టి జయద్రథు రక్షకోపాయంబుగ వ్యూహంబొనరించి మొనగాడయి
ముందరనిల్చినంత రథారూఢుండై యర్జునుండు మహారోషంబున

గీ॥ దేవదత్తంబుపూరించె § దిక్షుభోతగాళ్ళ, మాలుఘూశలంగక రాళ
మహిమ § పాంచజన్యంబు శౌరిపూరించెనంత, యుద్ధవీడివచ్చితుభయు
లు § యుద్ధమునకు ॥

క॥ నకునకుహరియిట్లనియెను § శరగురుడభయంబొసంగె సైంధవునకున
కున్నటువీరులు పదివేవురు § దరిజేరగవీరుజంప తరమేసీకున్ ॥

వ॥ అనిన వాసవి యిట్లనియె.

ఉ॥ ద్రోణునిగెల్చెదన్ గురు § వరున్ దెగటార్చెద కర్ణునోంచెదన్
బాణకృపాణపాణులు న § పారధనుర్ధరు లెందరుండినన్
ప్రాణములన్ హరించెద భ § వత్కృపనామొద నున్నజాలునా
స్థాణుడువచ్చిగాచినను § సైంధవుజంపక నూరకుందు నే ॥

వ॥ అని క్రోధావేశంబునంబల్కి సాత్యకి సమీరనందనుల ధర్మజరక్షణా
ర్థంబునిల్పి మొగ్గరంబుజొరు నెడ గురుండడ్డంబైన కృష్ణుండర్జునా యి
తండు నీకనుకూలుండుగాని ప్రతికూలుండుగాదు ప్రార్థించి యవలకు
నటపని నిగమించుము కాలోచిత కర్మలాచరించుట కార్యసాధనంబు
గదా యని మహాప్రసాదంబని యాచార్యునకు మ్రొక్కి యిట్లనియె.

మ॥ భవదీయానుచరుండ తావకకృపా § పాత్రుండ శిష్యుండ పాం
డువిభుండచ్యుతుడున్ యుధిష్ఠిరుడు § నన్నుంజూచు చందాన జూ
డవె నామేలుదలంపవే ప్రతిన § వాలాయంబు సాగింపవే
బవరంబందున నీకృపాగరిమ § నాపైనున్న కార్యంబగున్ ॥

చ॥ అనవిని కుంభసూతి దర § హాసవికాస ముఖారవిందుడై
కనికర మొంది యొందవి ప్ర § కారము కౌరవరాజు కేర్పడన్
కునిశితబాణపంక్తి మెయి § సోకగ నేసిన పార్థుడాధను
ర్ధనగుణమున్ విదల్చి మొనకై § జన వేగమె క్రోశదూరమున్ ॥

గీ॥ వారినవరించి కౌనికుంభనందనుండు మొనముఖంబుననిల్చెనప్పుడుకురుప్ర
కరమునర్జునుబొదవి సమరమొనర్చి శస్త్రములవీచె చేజాచి సవ్యసాచి॥

క॥ ఆచతురంగబలము చెల్లాచెదరై పోవ తనబలంబడరగ నా
రాచంబుల గుప్పెను నది వీచికలు క్రమక్రమంబు వెడలినభాతిన్॥

సీ॥ ధృతరాష్ట్రనందనుల్ శితబాణదీప్తులై, యొక్కచోట నొక్క
చోట, బలురు కృతాయుధ ప్రముఖులు రథికులై, యొక్కచోట
నొక్కచోట, విందానువిందుల మందశౌర్యస్ఫూర్తి
నొక్కచోట నొక్కచోట బాహ్లికకుంభసంభవజాత
కృపకర్ణు లొక్కచోట నొక్కచోట॥ గీ॥ జెరిని చేరి
బొదవిన చీమలట్లు నొకరికొకరెక్కు డౌకరు మహోగ్రపటిమ, జూ
పగా నేపుసూపడ నాపిరాడ కుండ నొనరించె గాండీవి చండపటిమ।

వ॥ అయ్యవసరంబున కురుపతి గురుం జేరి యిట్లనియె.

ఉ॥ నిన్నవలీలదాటియు జనెన్ నరుడా మొనజీల్చుచుండె నీ
వున్నఫలంబదేమి యిట నూరక చూచుచునున్నవాడవే
మన్న ధనుర్ధరుండవు జయద్రథుడున్ నినునమ్మియుండె వా
నిన్నశియింప జేసెదవొ నెగడ నమ్మితి మోసపోయితిన్॥

క॥ నీవలిగిన నెదురెవ్వం డావివరించ్చుండుగాడు వారునకుపశమే
నీవిశ్వాసంబిప్పుడి గావించెను పక్షపాత కౌటిల్యమునన్॥

వ॥ అని నిష్ఠురంబులాడిన కుంభ సంభవుండు కుపితుండై నేను ధర్మజుం
గాపెట్టుచు మొనదొలంగనైతి నదిగాక వృద్ధుడను పార్థుని జవంబు
నకు సరిపోదునే నీవుసమాన వయస్కుండవు కవచధారణవిద్య నీకుప
దేశించెద పార్థుని బరిమార్పుమని పురికొల్పి యుపదేశించిన నతండు
రథారూఢుడై కవ్వడినిమార్కొనిన కృష్ణుండు జిష్ణునకిట్లనియె

సీ॥ ధర్మాత్మునిర్మలున్ ధర్మజున్ జూదంబు, నాడించి యోడించి నాడు
వీడు, నడవులం దిడుములం గుడువజేసిన జడుం, డితడే పాతకుం డాత
తాయి, మేలిమిందూలి పాంచాలి మీయాలిని, మానంబులోనాడి
నూనపరచె, వజ్రిభుమాన్య శుభమన్యు నభిమన్యు బవరాన, నేకాకి
బోకార్చి వీకదాకె॥ గీ॥ రాయబారిని నన్నన రాని కాని పోనిహీనో
క్తిచే నవమానపరచె, శరపరంపర గురిపింపు నురువడింపు భీకరత
జూపు నీధాటి యోకిరీటి॥

క॥ అనునెడ రారాజు రయం / బున కవ్వడిఁజూచి నీకు ప్రభూతబలంబుల్
గనవచ్చితి జూపుమనన్ / వినివిని శిత శరములేసె విన్వచ్చుఁడాగిన్॥
వ॥ ఇట్లిరువురు దలపడిన వృషసేనుండు దుర్ముఖుండు సోమదత్తుండు భూరి
శ్రవుండు కృపుండు కర్ణుండు చేకితానుండు దుశ్శాసనుం డనమంద్రు
యోధులు సుయోధనునకు సాయపడిన పోరు ఘోరంబయ్యె నయ్యెడ
నిరుకరంబుల శరంబుల దూరంబున కురిపింప శంఖంబునూదు తవిదోయక
మునిశిర్ జేసి క్రీడికిత్తోడుగ నుత్సాహంబు గల్పింప పాంచజన్యంబు పూ
రించు కృష్ణుని ధ్వనిని యర్జునునకు పరాభవ బులైనను సంశయం
బున యుధిష్ఠిరుండు భీమసాత్యకుల నవలోకించి యిట్లనియె
ఉ॥ అక్కట మోసమయ్యె నరు / నాజిజయించిరి వెన్కముదను త్రో
డొక్కఁడు లేడు శంఖరవ / మూనడు కృష్ణుని పాంచజన్యమే
యిక్కడికిన్ వినంగలిగె / నేమియుపాయము మీరలేగి భూ
దిక్కులుపిక్కటిల్ల భవ / దీయబలంబుల జూపనోపరే॥
వ॥ అని పురికొల్పినంత.
ఉ॥ భీముడు భీమరూపమున / బెబ్బులి రీతిగ లేచి ఘోర సం
గ్రామము జేయ నేగ కడ / కన్ ఘటజన్ముడు నడ్డవచ్చి యో
భీమ నరుండు శౌరినను / వేడిమదాజ్ఞ వహించి పోయెం
ట్లేమరియాద జూపగద / శేగుననల్పుని గాదలంతువే॥
వ॥ అనిన సమీరకుమారుండు రోషావేశంబున,
చ॥ నినుబ్రతిమాలి వేడ నవ / నీసుర పార్థుఁడుఁగాఁడు ధర్మనం
దనుడును గాడు భీముడుగదా / ధరుఁడీతఁడు శత్రుపక్షమం
దునికివహించు నీకు విన / తుండగువాడెయటంచు నుగ్గదా
శనివడి ద్రిప్పి ద్రోణరథ / శైలము వ్రయ్యలు గాగ నేసినన్॥
క॥ గబ రాగని భీతినిన / మ్ముదుకఁడు ధరఁడిగ్గియరద ముక్కశకలములై మెద
లెను భీముఁడురయమున / గదలెను కృష్ణార్జునులను గలయుటకొరకున్॥
వ॥ అంత సాత్యకి యేతెంచెను భయపక్షంబులవారు పోరుచుండిరి రణరం
గంబు రక్తమయంబయ్యె నయ్యెడ.
సీ॥ భూరిశ్రవుండు గ ప్పున సాత్యకిన్ బడ / ద్రోసి పైపిక్కి కరాసిదీసి
కంఠంబు దెగ నేయ గడగెన కృష్ణుండు / పార్థుకా దాతమ్ముని ప్రాణములను
గాపాడుమని వేడగా / వాడిశరమున భూరిశ్రవునిహస్త / మును వధించె

నంత సాత్యకి లేచి యతని కుత్తుక ద్రెంచె, తదితర సైన్యసముదయము నణచె

గీ॥ సైంధవుడు కర్ణుని రథంబు క్రింద డాగె / పొద్దుగ్రుంకదను వచ్చె చప్పున బలంబు
కవ్వడి నిమార్గ్గానఁ గద్యంచె కడిమి మించె / నంత కృష్ణునితో బల్కె నర్జునుండు

మ॥ రవితా గ్రుంకుచునుండె / యుద్ధమిట ప్రారంభమయ్యె రథ్యంబులున్
జవహీనంబుగ గానవచ్చెను / ప్రతిజ్ఞాభంగమౌనొక్కొ మా
ధవ నీభార మికేయుపాయము / రణాంతర్భాగమందైన సైం
ధవుడే కానగరాడు వాడెచట / నున్నాడో చమూమండలిన్॥

వ॥ అనిన కృష్ణుండిట్లనియె.

ఉ॥ దీనికి నొక్కయోషధి / విధించెద జూడుమటంచు చక్రిమున్
భానునడ్డగించె పరి / పంథి జనంబట సింహనాదసం
ధాన మొనర్చుచుండె / మరణంబు భయంబున డాగియున్న వా
డైన జయద్రథుండు తల / యెంతట నెత్తి గనంగ నంతటన్॥

క॥ చూడుమని వ్రేలుజూపుచు / క్రీడి కర్ణుని రథంబు క్రిందన్ డాగి యు
న్నాడా సైంధవు తలదునుము / చూడుమి శిరమవని బడిన హానియగున్ జుమీ

వ॥ అని యుపదేశించిన గాండీవి కాండప్రకాండంబు దెగనేసి కందుకప్రాయ
మెగిరించుచుండె నంత

ఉ॥ సైంధవు మూర్ధమున్ దెగిన / శస్త్రగురుండు కృపుండు కర్ణుడున్
సింధువిభుండు ద్రౌణియును / సేనలతో నరుమార్గమున్ వడిన్
గంధగజంబు తుండమున / కంజములన్ విదళించుభాతి గ
ర్వాంధుల సంహరించెగదిమె / నర్జును డాహవరంగమందునన్॥

క॥ బవరంబొనరించుచు సైం / ధవు తల నెగిరించికొనుచు దర్పంబున పాం
డవమధ్యముడు వెలింగెను / భువిలో నరవిద్యకాడు బోలదిపరీతిన్

వ॥ అంత కృష్ణునిం జూచి వీని తల నెవ్వరు నిలుప్రదునన వీని జనకుండు తల
నిలగూల్చినవాడు మరణించునని శపించె నతండంబుధికడ తపంబు జేయు
చున్నాడు కరంబున బడనేయుమన పార్థుండట్టుల నొనర్చె పాండవ
బలంబుల సింహనాదంబులు జెలంగె విజయావహులై విచ్చేసి ధర్మజునకు
మొక్కి తత్కథావిధానంబు దెల్పిర వక్రపరాక్రమంబున కవ్వడి నివ్వటిల్లె
నంతట రణాంతరంబున. -( విజయము )..

సీ॥ ధృతిచేత ద్రోణుడు / దృఢతి జూపెను జయింప, లేక పాండవులు చలించి
చిరంత, నంత నాత్మజుడు స / త్యాలాపమూడి యశ్వత్థామ యేనుగు

వచ్చెననిన, నిజమంచు నెంచి యాత్మజుఁడంచు, గురుఁడు ప్రాయోప
విష్టుఁడయి యొరిగెనపుడు, సమయంబెఱింగి దుష్టద్యుమ్నుఁడారథం
బున కేగి కరవాలమున తదీయ: గీ॥ కంఠలుంఠన మొనరించె కౌరవాళి
శోకదందహ్యమానమై సొలిపడియె, కర్ణుఁ డప్పుడు సైన్యాధికారమూన
నతరహంకృతిచే రణక్షితికి వెడలె॥

క॥ అందరొకయెత్తు కర్ణుం డొకఁడనకొకయెత్తటంచు డోలీకృతమా
డెందంబున గుందియు సంక్రందననందనుఁడు కొనకు కర్ణుని గెలిచెన్ ॥

సీ॥ బ్రాహ్మణశాపాప్తి రథము గ్రుంకకయున్న: భృగుజాస్త్రమహిమలు
వీడకున్న, బలవైరి కవచకుండలములు గొనకయున్న, కుంతి వరము
వేఁడి కొనకయున్న, శాంతనవుండు నిస్సారోక్తులనకున్న, శల్యసార
థ్యంబు జరుగకున్న, శక్తిప్రయోగంబు సౌమాన్పక యున్న, శ్రీ
కృష్ణుఁడర్జును జేరకున్న, గీ॥ పోఱలో కర్ణుగూల్ప పురారికిని ము
రారికి ధరారికిని దండధారికిని, నృపారికిని ఔరకారి! సీరికైనఁ క్షితిని
తలక్రిందు తపము జేసిన వశంబె॥

వ॥ కర్ణుండు దీర్ఘుండై రణార్ణవంబున మందరంబు చందంబున మెలం
గుచుండ నచ్యుతుండర్జునున కిట్లనియె,

ఉ॥ అక్కజమైన యుద్ధమున నందర గెల్చు టటొక్కరూపు వీ
డొక్కఁడవక్రవిక్రమము నొప్పఁగఁదోఁచెడు వీటుబటు నీ
వొక్కని నాజిగెల్చుట నదొక్కవిధంబు నెఱుంగుదే సుధా
భుక్కుల లెక్కసేయఁడు నమోఘపరాక్రమశాలి యర్జునా॥

వ॥ నీయస్త్రశస్త్ర పరిభావంబుల ప్రజ్వరిల్లజేయు సమయంబిది సాహస దో
హాళుండవై సమరంబొనరింపుమని పురికొల్పుసమయంబున శల్యుండు కర్ణు
నకిట్లనియె- క॥ విజయుఁడు విజయుఁడు హనుమద్ధ్వజుఁడు మహేంద్రజుఁడు వాని
ధాటికి తాళ, ధ్వజుఁడును కుంభజుఁడు రణోర్విజయింపఁగ లేనివిధము వింటివె కర్ణా

చ॥ మఱచితివా యిదేటి యభిమానము మత్స్యనృపాలు గోవులన్
మరలిచినాఁడు నిన్ను గురునందను సైంధవు ధార్తరాష్ట్రులన్
పరిభవమొప్పఁజేసి తలపాగల తిగెలరీతి గోసి యు
త్తరకిడునట్టి యోధుఁడుగదా మరుపాయెనె నీకు కర్ణుఁడా.

వ॥ అని పెక్కుభంగుల శ్లాఘించుచు కర్ణుని గర్హణవాక్యంబుల గజీలం
చుచుండ సూతసుతుం డిటనియె.

ఉ॥ వందివిధంబు నీవిపుడు వర్ణనఁజేసినయంత భీతియుం
జెందుదునే కురుప్రభుని సేవ కొఱంతవొనర్తునే భుజా
స్పంద బలప్రభావమున శాత శిలీముఖముల్ నిగుడ్చినం
గందువుగాని యిట్టికొఱగాని దుశుక్తుల బల్కఁజెల్లునే॥

వ॥ వలప్రేలెదు రథంబు దోలుమనఁటయు నతండట్లొనరించె నంత కరికరి
గిరిగిరిహారిహారి వైఖరిఁబోవుచుండి రథంబున వైమానికులు వర్ణింపదొడంగి
రంతట. ఉ॥ పోడిమిమీఱ ద్రోణనదిపుత్త్రులతో తులదూఁగిమున్ను పో
రాడినభంగి క్రీడిబలమంత బయల్పడఁజూప కర్ణుఁడా
వాడు జయించిపోయి మఱునాడు తదీయబలంబునెల్ల న
ల్లాడ నొనర్చె కౌరవబలావళి మెచ్చవదగ్ర మూర్తియై॥

ఉ॥ పాటవమొప్ప భీముజము పట్టిని మాద్రికుమారులం నిరా
ఘాట పరాభవంబు గలుగం బెణఁకంగ నొనర్చి నంత పో
రాటమునందు నిల్వఁగ తరంబును గాక కిరీటి భీతిచే
నాటిరణంబు మాని యదునందను నింగని కర్ణుఁజూపుచుం॥

ఉ॥ సందియమేల నాకిపుడ సాధ్యుఁడవధ్యుఁడ భేద్యమూర్తి మ
ధ్యందిన చండభాను వలె తప్పక యొప్పుచునుండె దేవకీ
నందన పాండుకౌరవ జనంబిటు నవ్వినఁ నవ్వుగాక బో
స్యందనముం మరల్చు విజయంబుఁగొనందగు ప్రాణముండినం॥

క॥ వావుదు హరియిల్లనియెను । నీవిటులాడంగ జెల్లునే విజయాఖ్యా
ప్రావీణ్యము కొనసాగున । భూవరు లేమని కొనెదరొ పుణ్యచరిత్రా॥

ఉ॥ ఇంతకుమున్న ధర్మసుతు హీనుని జేసి పరాభవంబు కొం
డంత లొనర్చి పుచ్చె మనమాతని నూఱడిలంగ జేసి రా
నెంతయొ మంచి యుక్తి యిపుడీతని మార్కొన భీమసేనుఁ
గుంతికుమారమధ్య పురికొల్పుము వచ్చెదు దాక యాజికై

వ॥ అని భీముని సంగ్రామంబుననిల్పి ధర్మజుని సమీపించిన కిరీటిం గాంచి
కర్ణుఁడు మడసెనని భావించి యిట్లనియె.

ఉ॥ నోటనురానిమాటలన నంపరిభావమొనర్చెఁ నామెయిం
నాటినపోటు లేమనఁగ నప్రదరంబుల గ్రుచ్చె కర్ణుఁడా
పోటరిబంటు జంపితివె వప్పు నిను మెచ్చఁగ వచ్చుచున్నిటం
మేటివినిన్నెదిర్చెదుర మీఱెదుఘాటిగ లాడెవంతిలం॥

క్షుత్పిపాసలం, దూలుట బాంధవాప్తులు సుతుల్ మృతిజెందుట మృ
త్యురూప నీ. మూలమునఁ జనించె సరెపో కులనాశకమాకుకష్టముల్

వ॥ అని నిష్ఠురవాక్యంబులాడి యొరబెట్టిన వాలునుమరలబెరికి కృష్ణుండిదే
మన మన పార్థుండిట్లనియె.

క॥ ఈనరనాథశిఖామణి కే నేనాడిన చెడుపలుకుల కిదిప్రాయశ్చి
త్తానుభవము నాతలదెగ కే జూనితి నన్నడ్డగించ బోకుముకుందా॥

వ॥ దీనికేమందువన కృష్ణుండు నీవాత్మస్తుతి గావించుకొనియెదవేని స్వమ
రణంబు సమంబని ధర్మవిదు లుపన్యసింతు రనవుడు తన జననంబు మొ
దలు నాటివరకు గావించిన పురుషార్థంబులు సంగ్రహించికొన కన్నీరు
నించుచు చిన్నదనంబున యున్నపదంబులకు ప్రణమిల్లుచు,

శా॥ నా శిరంబుల దుర్మదోన్మత్తుల రవంతఁ స్వాంతమందుంచ క
న్నా నన్నుఁ దయజూడు నేడుజని కర్ణధ్వంసినై నిల్తుగా
దేనీ నేనిటు రాను విక్రమమున కుంతీదేవికిఁ నల్గురే
సూనుల్ నీయుపమానముఁ సైతు నే సూతాత్మజుఁ ద్రుంచ నే॥

వ॥ అనిన ధర్మజుండు శోకించుచు నిట్లనియె.

క॥ వడముడికిని పుడమిని గట్టుడువడి జెసియుదుములఁ గుడుతు నడవులలో
బడుగులనడుగుల బడియుం దెసువాడను జడుడ నేనకిదగ పార్థా॥

వ॥ అనిన కృష్ణుండు బావా మాయిరువురకి ప్రసన్నుఁడవు గమ్ము యుద్ధంబు
నకు బంపుమని ప్రణమిల్లిన కృష్ణపార్థులం గౌగలించికొని యిట్లనియె.

ఉ॥ మానసమందు దఃఖమున మానసము రెండుబెసంగుచు డెన
య్యానను బట్టి కర్ణుడిది యాహవరంగము రాకు ద్రౌపదీ
మానిని జేరి యుండుమని మాటల పోటులొనర్చె యప్పుడే
ప్రాణము లేకుండె నిది పాపపుజన్మ మికెందు కచ్యుతా॥

వ॥ అనిన యర్జునుండిట్లనియె చ॥ గడచిన దాని నెంచుటకు కార్యము
గాదు మహాత్మ, నిన్ను జూచెదు కోరకేగుదెంచితిమి చెప్పెదనేటిరణం
బులోన కర్ణుఁడు మడియుఁ సురేంద్రుఁడు హారుండు నజాదులు తో
డువచ్చినఁ, విడువను రాజ్యభోగ పదవిఁ గొని సౌఖ్యమునొందుమగ్రజా

వ॥ అని నిజస్యందనమందు ముకుందునిడుకొని సంక్రిందనినందనుండు రణం
బును ప్రవేశించినంత భీముండు కౌరవసేనం విజృంభించి దుశ్శాసను రొ
మ్ముపిదళించి రక్తంబు ద్రావె నంత నర్జుననుండు నడుమదలపడిన వృష

సేనని సంహరించె కర్ణుండు దీనుండై శోకకలితుండై యూర్కొని
యె నొండొరులు దివ్యాస్త్రంబులు ప్రయోగించి కొనుచుండిరి రాధే
యుండు నాగాస్త్రంబు ప్రయోగింప వాసుదేవుం డపాయంబుగల్గునని
పంచాంగుళ ప్రమాణంబును రథంబునందొ్రక్క నంత నశ్వసేనాభి
ధాన భుజంగంబే తెంచి

క॥ అమరులునిడు పార్థునితల । బొమిడికమును ఖండఖండములజేసెను శృం
గము లేని నీలగిరి చంధ । దమున రణాంతరమునందు నరుడొప్పారెన్॥

వ॥ వెండియు నప్రచండ భుజంగంబే తెంచ గరుడాస్త్రంబున దానిఖండించి
యర్జునుండాక్షణంబున ధౌతవసన శిరోవేష్టనంబు నమర్చుకొని యుద్ధో
న్ముఖుండయిన భీముం జేతెంచి యిట్లనియె. ఉ॥ నిన్నెదిరించి కర్ణుడిట
నిల్చుటగాక ముకుందునిన్ నినున్, భిన్నశరీరులట్లు బరపెన్ శరవృష్టి
ని మున్ను పాండవా; యున్నతి గాల్చునట్టి బలమానుమి లేద త్వరన్
గదా హతిన్, బన్నమునర్తు నీప్రతిన భంగమటంచు దలంచి నిల్చితిన్॥

క॥ రాధేయునిముందర నీ । యోధత్వము సాగదన్న యుద్ధమున బల
ప్రాభాస్యము జూపించవొ । కో ధైర్యము శౌర్యమెల్లగొనినిల్చుమనిన్

క॥ గంధర్వులగెల్చుట విప । క్షంధరునోడించుటయు ప్రకాండశరమునన్
సైంధవునిందునుమూట యా । బంధురవిక్రమము జూపవలె తరివచ్చెన్

వ॥ అనిన కృష్ణుండు తెదన కూలంబుగ రోషంబెక్కించిన పార్థుండభిమా
నావేశంబున బ్రహ్మాస్త్రంబేసినదాని సంరంభంబుడిపి ధనుర్గుణంబు
ఖండించిన కనలి కర్ణుని కవచకుండల మకుటంబుల ఖండించినంతబరి
మేనతేకువ విడనాడక పోరుచుండెగాని దైవశిక్షిత్తుని శాపంబున
రథచక్రంబు భూమిం గ్రుంగ గురుశాపంబున దివ్యాస్త్రంబులు ప్రతిభా
సిల్లకుండె శల్యుడమంగళవాక్యంబుల నిరుత్సాహంబుఁ గల్పించుచుండె-
చేయునదిలేక రథంబుగదలకునికి యర్జుననవలోకించి యిట్లనియె.

చ॥ హాతికనీకు నీభయము నందివచించుట గాదు ధర్మపం, ప్రకరణవిధంబు
దెల్పుటయె కాని మరొండు దలంపబోకు నా, యరదము నెత్తుదాక యుపు
డాయుధమానకు ధర్మరాజుసో దరుడవు ద్రోణశిష్యుడవు ధర్మమెరింగిన
వాడవర్జునా॥ వ॥ అని పెక్కుభంగుల పాదితెరంగు దెల్పిన కృష్ణుండిట్లనియె

సీ॥ ధర్మమా మాయజూ । దంబాడి సర్వస్వ, మపహరించి రయానక నడ
వికంపు, ధర్మమా పాండుసభన్ । ద్రౌపదిన్ రావించి, భంగపాటొనరించి

శరిహసింప, ధర్మము గాధని ꠰ ప్రవహించుతరి పాండవుల లక్క యింటిలో ꠰ పలదహింప, ధర్మము పార్థనం꠰ దమునిపద్మశ్యాహ, మం దుపాల్గొని పది ꠰ మందిజంప, గీ॥ ధర్మపదమేల జెప్పెదు దుర్మదాంధ కోడలికి బుద్ధిజెప్పి దంచుతనమూను, యత్నవిధమయ్యె నీ చిత్తవృత్తి న దయు꠰ కట్టిపెట్టుమి నీధర్మ కౌశలంబు ॥

ఉ॥ సచ్చెదనన్న భీతిమెయి శౌర్యవిహీనత మాటలాడబో, నిచ్చెదు వాడె వండు పరమేశ్వరుడడ్డమువచ్చి నిల్వనీ, ముచ్చటతేల చాలు తన పుత్రు నిజంపినకోపమున్నవి, వ్వచ్చెదుకర్ణనీతలను ద్రయ్యలు జేయక పోవనిచ్చనే

వ॥ అని కృష్ణుండు దూరవాడినంత మహాకోపంబున

గీ॥ తతుౕ పంప్రతాపకరము ప్రచండమైన꠰ కర్ణురథకేతనంబును కనకపుంఖ భల్లమున నేలగూల్చి యప్పార్థుడపుడు꠰ కౌరవబలంబునెల్ల చికాకొనర్చె॥

శా॥ రారాజద్రథకేతనంబుబడ సంగ్రామంబు నందుండు న, క్షారవ్యూల్ నిజ కీర్తిదర్పబల పంఘుంబుల్ ధరన్ దెళ్లిన, ట్లారా ధేయునిపై నిరాశులయి హాహాకారము జేయుచుం, జారజ్ఞాల్చ బెబ్బులిన్గనిమృగవ్రాతంబుతో భాతిగన్

వ॥ రథకేతన పాతనంబాచరించిని కనలి కర్ణుండుద్దండ కాండప్రకాండం బుల కృష్ణార్జునులపై బరపి రథంబు నూకింప సమకట్టి భుజాగ్రశంబు సాచి జవంబున లేననెత్తుపమయంబున.

క॥ రంగస్థావరజంగమ ꠰ సంగతిభరమూను భూమి చక్రముపైకా రంగుళములెతులేచక ꠰ తాంగము రవ్వంతగదల కదిగనుండెన్ ॥

వ॥ అంత కృష్ణుని కనుపన్న నరింగి సవ్యసాచి సహస్రారశతార సన్నిభంబ గునస్త్రంబునను సంధించి ధ్యానపూర్వకంబుగ,

క॥ నేనుతపస్ఫురణంబు న ꠰ దానంబునగురుజనాభి తర్పణమున ని త్యానుష్ఠానవ్రతముల ꠰ పూనికగలవాడనేని పొలియుతనీడున్ ॥

వ॥ అని రోదసీకుహరంబులు ఘూర్ణల్లు ప్రయోగించినంత.

క॥ ఏకునవనోరాడను కు ꠰ ప్రాముసుతునిచేతసంగరంబునమును వ జ్రాహమోఘుహతినిగూలిన ꠰ భూమిధరమురీతిసూత పుత్రుడుగూలెన్ ॥

ఉ॥ కర్ణునిపాటుగాంచి త్వరగన్ కురుసైన్యము పారజొచ్చె స ప్తార్ణవముల్ ప్రదగ వము లందినయట్లు పృథాకుమార సం పూర్ణజయధ్వనుల్ వెడలె భూనభముల్ వగిలి మ్రోగుచుండ సం కీర్ణములయ్యె పార్థకర కేశవహస్తద శారవంబులున్ ॥

వ॥ ఇట్లు విజయుండు తనప్రతిజ్ఞ నెరవేర్చుకొని విజయంబొంది ధర్మజాదుల
మనస్తాపంబుడిపి భూరిశ్రవుని హస్తంబును భాగితుండైన కర్ణుని దుంచుట
చుట ధర్మవిరుద్ధంబులని రణకోవిదులు వలంతులైన వారికిష్టంబుగ
వర్తించుట యతనికి యభిమతంబుగావున తదనుకూలంబుగ సంచరించె.

మరియును. సీ॥ కుంతీసుతాగ్రజుఁ ఘోరశస్త్రాస్త్రుని, హతిచేత మద్రభూ
పతిగతించె, విక్రమోద్ధతిని క్రమక్రమంబుగకురు, పతిముఖ్యనృపుల
మారుతి మారించె, కృపలేక గురుపుత్రుఁ డుపపాండవాది పాంచా
లరాడ్సుతులఁ నోడఁ వధించె, ద్రోణిశిరోమణిఁ ద్రౌపదికిడిపుత్ర
శోకంబుమాన్పి యర్జునుడుమించె. గీ॥ పదియునైదు రెండు పగ
లొక్కరాతిరి బోరిసమసిరెల్ల కౌరవాళి, గంగకొడుకు గురుడు కర్ణుం
డుఁ శల్యుండు రాజరాజు ఘోరరణమునందు ॥ తర్వాత,

సీ॥ అర్జునాదిగుమని వారిబల్కగాతోను కూర్చున్నరథముభగ్గురనిమండె
దిక్కులేకడవిలో సృక్కెదవనివారిఁ బదరిగాంధారిశాపంబొసంగె
కృష్ణకల్పితమైన కృత్రిమలోహభీ ముని ధృతరాష్ట్రుడుచునిమ్మైచె
కర్ణుడన్నయటంచు గనిధర్మజుడుస్త్రీల కిఁకమరహస్యంబులేదనిశపించె
గీ॥ యెన్నియోచిత్రములు సముత్పన్నమయ్యె నెట్టకేలకుధర్మజుపట్టభద్రు
జేసికృష్ణార్జునులువిభాసిల్లుచుండిరంచితాస్థితుల పరిసంగించుకొనుచు

—( దిగ్విజయము )—

క॥ కొండొక కాలంబునకును పండితమణి వ్యాసమౌని పరుని యనుజ్ఞా
తుండై హయమేధము బ్రహ్మాండమునఁ జయించి చేయయమసుతుడూనెఁ
క॥ ఒకదిశకు భీముడును వేఱొకదిశకును నకులుడుఁ మఱొకదిశకును మా
ద్రికనిష్ఠకుమారుడుపా యక యేగిరి నృపులొసంగు సప్పునముకై॥
వ॥ యాగహయ రక్షణార్థంబునకై యర్జునుండు నిలచె చతురంగ బల
సమన్వితుండై యప్పుడు,
గీ॥ అశ్వమేధయాగంబునకై యనేక నవనవద్వీపభూనాథ నివహములను
గెలచిదిగ్విజయంబున క్రీడిమెరసె యశముపిక్రమభృశమున్ దిశలువెలుగ
వ॥ తనఁనెదిరించిన తామ్రధ్వజ నీలధ్వజ మయూరధ్వజ ముఖ్యుల కోదండ
పాండిత్యంబున జయించి గంగాశాపవశంబున బభ్రువాహనునిచే మృ
తుండయి యమృతంబున జీవించి యాగాశ్వంబుతో హస్తిపురికివిచ్చేయు
చున్నాడను వార్తనెఱింగి ధర్మజుండు శ్రీకృష్ణున కిట్లనియె.

క॥ జూభుగాద్భుతుడా జన్మ ప్రభృతిబహుళకష్టములకు భాజనుడయ్యెన్
శుభలక్షణలక్షితుడై ప్రభవించినవాడఖండ బలుడుగదహా॥

సీ॥ లక్కయిల్వెలువడి దిక్కులేకొకరింట, నేకచక్రమున చిక్కాశబడిరె
భూప్రదక్షిణము సల్పుటకు తానొకపరి, వాగ్జకాకృతితోడ వన
టజెందె, పాశుపతాదుల బడయనేకాకియై, యేడేండ్లుమమ్ముల వీడి
యుండె, కర్ణసంశప్తక ఘటజన్మ కృపభీష్మ, బాణక్షతలచేత బా
ధనొందె॥ గీ॥ నాత్మజుని శోకమొందె సవాశ్వమూని నేలనంత చరిం
చెను నీటిదాక, కడుపునిండన్నమును తనకంటినిండ నిద్రలేకుండనుండె
సుభద్రవిభుడు॥ క॥ వాశ్రైయ నేకకష్టములు లేక వ్యాధియనుభవించె లేదుసుఖము
ల, శ్రీకాంత దెలుపుమయ్య శుభాకృతిగల వానికిట్టి యాపదగలదే॥

వ॥ అనిన హరియిట్లనియె, శుభలక్షణ లక్షితుండయినను తనువుమాత్రం
బున కెక్కుడుగా చిహ్నతోడలుండుట కలవడిజెందుచున్నాడు దీనికి బెం
గగొనవలదని చెప్పెను. మరునర్జునుండు హస్తిపురంబున కరుదెం
చుచుండ పురజను లీవిధంబున కీర్తించిరి.

సీ॥ హయరక్షణార్థమై యరిగి దిగ్దేశభూ, ధవులనిర్జించు ప్రాభవుడువీడె
యాదినారాయణుండైనశ్రీకృష్ణుని చేత, సుఖము లొందినప్రాణసఖుడువీడె
వేయికన్నులుగల్గు వేల్పురాగద్దైపై, పరగనుండిన దయాపరుడువీడె
యేకటిశయ్యన మూకటినోడించి, పాటికెక్కినరాజ మేటివీడె

గీ॥ కుంతిగారాబుకడగొట్టు కొడుకువీడె ధర్మజుడుమెచ్చదగిన సోదరుడువీడె
ద్రౌపతిసుభద్రచిత్రాంగదలనులూచి సాధ్వులవరించుమనసవ్యసాచివీడె

వ॥ అని పెక్కుభంగుల వినుతించిరి హరియనుగ్రహమున నర్జునుని దిగ్వి
జయంబున ధర్మజుండశ్వమేధంబొనరించి విగతకల్మషుండయ్యె తదనంత
రంబున. —(ఉపసంహారము.)—

గీ॥ భండనంబైనపిదప భూభారమూని యశ్వమేధంబుగావించియమసుతుండు
ముప్పదైదేండ్లెను పుడమి నేల్లి తమ్ములచ్యుతుడాదిబాంధవులుగొలువ

వ॥ కొంతకాలంబు గడచిన యనంతరంబున,

ఉ॥ యాదవులంతద్వారకపురాంతరమందు సురానుపానగ
ర్వోదయులైమహామునివచోద్ధతిశాపము నొందివారు వా
రేదితలంపులేకకలహించుచుజత్తుకట, చెరింగి దా
మోదరుడిందిరానందనుని నొయ్యనరమ్మని బంపెదారకున్ ॥

క॥ దారుకుని రథము నెక్కియు ద్వారకకే తెంచె నింద్రతనయుడు నచటన్
శ్రీరామకృష్ణులంగన వారెటకో పోయిరనెడు వార్త నెఱిఁగెన్॥
గీ॥ బాలయౌవనవృద్ధు లపారసంఖ్యజనము వందలకొలది యమునతటమున
పోఁ సమసిరి ముసలముకారణమున క్రీడి యారామకృష్ణుల జాడఁ గనఁడు
క॥ ఆపార్థుండానగరి వని యీ పారణ్యంబునందు మెలఁగఁగ బోయల్
రాపిడిఁ గొనివచ్చుటఁ గని యే పాలములమంది రాక యెఱిఁగించుడనన్॥
క॥ ఈయాపాలము లమెలఁగెదు బోయెల మిక హలధరుండు పురుషోత్తముడున్
కాయములనువిడి దివికిన్ బోయిరి కనివచ్చితిమి సుపుణ్యచరిత్రా॥
వ॥ అని యెఱిఁగించిన యజ్జనంబు లమిత విషాద ఖేదంబు లాత్మనిండ న
మ్మార్గంబుబట్టి చనిచని యొక్కయెడ కైలాసాంజనశైలంబులం బోలు
శరీరంబులఁ గాంచి బలరామకృష్ణులని భావించి సమీపించి శోకింపందొడంగె
ఉ॥ చాలిన భోగభాగ్యముల సౌఖ్యము లొందుచు నిర్భయంబుగా, మేలుప
ఘార్గము ల్రుచిగ మెక్కుచు మేకలహంసతూలికా, డోలికలం బరుండుచు
నలుంగతి నైకధరాటవీస్థలిం, గూలిరవీ లమృత్యువశగోల్హాని యీవిధి
జేసెదైవమా॥ క॥ దేవస్తవనీయులు వసు దేవసృపాత్మజులు భూమిదేవ ప్రి
యులుగా, దేవాంశసంభవులు నవభావజసుందరులు మేనభావలు నాకున్
సీ॥ ఒకకంచమున మెక్కి యొకమంచమున సొక్కి, యొకపంచమును మున్న
యుండినాము; యొకవాడలో నాడి యొక మేడలో గూడి, యొకవీడులో
పల నుండినాము, యొక చేలమునుగట్టి యొకశీలమును బట్టి, యొక కా
లమును గూడి యుండినాము, యొక యీడు గలవార మొకజోడు గలవార
మొకనాడు పగ బూనకుండినాము॥ గీ॥ వందలకొలంది బాంధవబృంద
ముండి పుత్రమిత్రకళత్రిలు భ్రాతులుండి, దిక్కులేనట్టి మరణమొం
దిరిక వీరు విధికృతంబెవ్వడైన దప్పింపగలడె॥
వ॥ అని కన్నీరుమున్నీరుగా వగచి యాకళేబరంబుల కగ్నిసంస్కారంబు లాచ
రించి పురిప్రవేశించి కాలవిపర్యాసంబునకు శోకించుచు
ఉ॥ ద్వారక రేపుసంద్రమున దప్పక మున్గునటంచు చెదింగియా, నారదుసద్వచో
న్నతి మనంబున నెంచుచు మధ్యరాత్రి వే, ర్వేగగమనార్థవస్తువులు వృద్ధు
లు బాలురు బండ్లమీద రా, గారభసంబున న్జని యెకవ్వడి పంచవటీప్రదేశమున్॥
క॥ కనురెప్పపాటుమహా దుఃఖ నికాయము వెల్లువిసర మితిమీరు పయో
ధినిలోన మునిగె ద్వారక యనిమిషులా వాయానంగనయ్యుదయమునన్

వ॥ పంచవటీ ప్రదేశవనాంతరంబున

క॥ గాండీవము చేనమరక । కోదండము బండబారవు గొని యింద్రతనూ
జుఁ డధికలాఘవపథను । పాండిత్యము లేమి బెల్చె వైవర్ణ్యమునన్ ॥

సు॥ హరికిన్ సిరికి వైరులై దనరు బోయలు త్యాగి యరాగి తత్, సత్పరుఁడుం బోలి
వధూజనానుశీలనభూపబ్ధియగా పార్థుడూ, పిరిలేనట్టిశవంబు మాటిక్కనిల
చెన్నేమాట తెలన్నమా, వగు కారుణ్యము లేనివారలకు దౌర్బల్యంబు వాటిల్లదే

గీ॥ ఘనులు యదువృష్ణి భోజాంధకప్రవరులను కామినులు నేడకన్నరుంగక
నుఖించు; వారు బోయలచేబడి వనటగొనిరి మంచిచెఱుగులు సతమని
యొంచబడవు.

వ॥ ఇవ్విధంబున పంచవటియున్న చోరులు సర్వస్వంబు దొంగలించుకొన
సాగిన పార్థుండు వారలవారించుట కెంతో కష్టంబయ్యె కృష్ణాష్టభార్య
లకు తదితర యాదవాంగనలకు భంగంబుగాకుండ కష్టాతిశయగ గాండీ
వంబు ద్రిప్పుచు రక్షించుకొనియె తనతూణీరంబు బాణవిహీనంబయ్యె
కిరాతకులచే కీడొందక నేర్పున ప్రాణంబుల దక్కించుకొనియె రుక్మిణి
మొదలు భార్యాష్టకము పయోనిధిని ప్రాణంబుల వదలిరి పార్థుండట
నిల్వక గంగాతీరంబునకుజని యోగాభ్యాసంబుననున్న వ్యాసునిదర్శించి
యిట్లనియె. క॥ సత్యవతీసుత సఖిలాదిత్యస్తవనీయ యోగదీపితహృదయా
సత్యస్వరూప పార్థుడ నత్యంతప్రీతి జూడు మయ్య మహాత్మా॥

వ॥ అని వినుతించిన వ్యాసుండు కన్నులు దెరచి యతనిముఖవైవర్ణ్యంబు
నుంజూచి యిట్లనియె.

సీ॥ వధుసయోగ్యులతో వారలజంపితో । రణపరాజితుడవై రాగలిగితో
శరణన్న దీనుల కరుణించ వెరచితో । నిరపరాధులయెడ నిందలిడితో
పరమసాధ్వుల గాంచి పరుషంబులాడితో । పరవిత్తసంగ్రహపరుడవైతో
యప్పించు ధనికుల నొప్పించి వచ్చితో । యిచ్చెదనని వరంబీయవైతో

గీ॥ పూని పదుగురికిష్టంబు గాని నడక । నడచితో నీముఖంబు చింతాభరంబు
గలది కాగనిపించె నికేమి వంపు । ధర్మరాజసహోదర ధర్మశీలా ॥

ఉ॥ నావుడు పార్థుడిట్లను జనార్దనుడున్ బలరాముడాది ద్వా
రావతిగల్గు యాదవ ధరావరులంత కుటుంబయుక్తమున్
దేవపురంబు జేరిరి కథింబడె ద్వారక రూపుమాసె దే
వావచిఖుంపజాల పరమాత్ముని కృష్ణుని బాసివచ్చితిన్ ॥

క॥ హరిలేనియంతలోపల పరమోత్సాహంబుబాహు బలముల్ బాణ
స్ఫురణాస్త్రశస్త్రలాఘవ పరివర్తనలేదదెంత పాపమో మానీ ॥
వ॥ అని పల్కిన వ్యాసుండు యోగదృష్టింబరికించి యిట్లనియె.
మ॥ మునిశాపంబున యాదవుల్ మడ సీఘ్రుల్ వారికై శోకమూ
సినలాభంబును లేదు దైవవిధి మాన్పింపన్ సమర్థుండు లే
డన ఘూనీకు విషాదమొందులకు బ్రహ్మాదుల్ నిమేషంబు నం
దు నరాకీడు లెరుంగ లేరు జగమెంతో మిధ్య యూహింపగన్ ॥
మ॥ హరియున్ నీవు జనించి దుష్టులను సంహారంబు గావించి భూ
భరమున్ మాన్పితి రింతమాత్రమునను నీ బాహుబలంబొప్పె శ్రీ
ధరుడేగన్ నినుబాసినీ బలమునీ ధైర్యంబు శౌర్యంబు నా
హరికే ముట్టెను నిష్ప్రయోజనము లాయస్త్రంబులింకేటికిన్ ॥
మ॥ తగు కాలంబున శౌర్యధైర్యములు మేధాశక్తి శోభిల్లునా
తగు కాలంబు దొలంగువేళ విపరీతస్ఫూర్తివాటిల్లు నూ
రిగణోత్తంసులు శోకమోహముల దూరీభూతముల్ జేసి యుం
డగలారజుకాన జావుపుట్టుకలు నానా కాలమూలంబులో ॥
ఉ॥ నీవు జనించు కారణము నేటికిదీరెను మీ శరీరముల్
బోవిడనాడి యార్యనుతి పూరితముత్తమ లోకవాసముల్
సావధినొంద నెంచుడి యొసంగితినీకు హితోపదేశముల్
గావున ఘోరమౌ కలియుగంబును జూతురె మీదృశోత్తముల్
గీ॥ పాపపూరితమై కలివచ్చుచుండె సత్తములు జూడనొల్లరయోగ్యకలిని
తత్సమాచారములు కొన్ని తగవచింతు విను మునీవంత విడనాడి జనవరేణ్యా

( కలిధర్మంబులు )

క॥ కలియుగమును నాలుగు లక్షల ముప్పదిరెండు వేల సంవత్సరముల్
గలదైవదిల్లును తొలుత గొలుతన్ సద్ధర్మముల వదలొక్కనకుండున్
వ॥ శాపవశంబునం జేసి మూడువేల నలుబదినాలుగు వత్సరంబులు దుర్గంధ
రక్తపూరితుండై యశ్వత్థామ వారణాశిని వసించును క్రమంబుగ చంద్ర
సూర్యవంశ క్షత్రియులు ధర నేలుకొందురు తర్వాత
క॥ జనమేజయ జనపతి మీ మనుమని కొమరుండు సర్పమఖమొనరించున్
జనకుని కారణమున సర్ప్యాన సర్పగణంబులెల్ల నందు హరించున్ ॥
వ॥ తదన్వయంబున పెక్కండ్రు జనింతురు

గీ॥ చంద్రగుప్తుండశోకుండుజనినపిదపసేనంను డనురాజుశూద్రాంగ కొజనించు
పద్మపతియనురాజుకు ప్రబలశౌర్యస్థైర్యుడై చక్రవర్తిపదంబుగాంచు
క॥ శ్రీశసూర్య చంద్రవంశ జనితరాజుల జెరపురతను నిక్కముగధరా
పతులందరు సంకరులై కతిలేక చరింతురతని కాలమునందుఁ॥
వ॥ నందునిచే రణపరాజితులై కారాగారంబుజేరి కొంతకాలంబునకు విము
క్తులై స్వధర్మంబులబోసడి శూద్రాచారసంపన్నులై ప్రచ్ఛన్న వేశంబు
ల పరదేశంబులజేరి తమతమబలంబుల కొలంది రాజ్యంబులాక్రమించి
కొని పల్లవరాష్ట్రకూట చాళుక్య కాకతీయులనందగు నలుకోలంబుల
వారై సంబాధంబు లందుచు పరస్పరవైరంబులచే నైకమత్యంబులేక పే
రసహాయంబున జెముదురు తనుపరి యన్య దేశీయులగు తురుష్కులు
హూణులాక్రమింతురు సార్వభౌములై సర్వాధికారంబు వహింతురు
ప్రజలు సనాతనధర్మంబులవదలి కాలోచిత కర్మంబుల మొదలగలరు.
క॥ కలియైదువేలయేండ్లకు గలుగునుసంకరము వర్ణగౌరవమెల్లన్, దొల
గునుయార్యులకు నదర్మములునదులింక మరిక్షత్రియుల బలముడుగున్
వ॥ యుధిష్ఠిర విక్రమార్క శాలివాహన విజయనాగార్జునాభినందన శకంబు
లొప్పుచుండు నందు. సీ॥ వేదాదివిద్యలుకు విఫలంబులై పోవు, శిష్టమాన
వులు వాక్సిద్ధిజెడున, మారురూపముల చే పారులుచరియింతుర్, నిఖిల
సదాచారసస్వగాలగు. రాజులనోన్యస్య ధర్మ హిదూరులై యుందుర్,
లేశంబున్యాయంబుకు లేకయుండు, సంకరజనులకే సామ్రాజ్యములు
గల్గు, చెడిబ్రతికినవాడు శిరులజెందు. గీ॥ నథమశూద్రుల కాచారమ
ధికముండుకు నన్నవిక్రియలగుదురు నఖిలజనులు, మతము లెన్నెన్నియో
గల్గుమానవులకు చిత్రమైనపనులే గల్గు ధాత్రియందు.
మ॥ కొడుకుల్ తల్లులదండ్రులన్ విడతు రాకొడంగ్రుడు నయ్యత్తెలన్ గుడువన్
బెట్టకదూరనాడెదరు లోకుల్లూటపాత్యంబుగా, నడవన్ జూతు పణ్యయో
నులయి నానాతిరులన్ బోదురే, పడతుల్ భాగ్యలుభర్తలన్నవిధముల్ భంగం
బులోయుంతటన్ ॥
మ॥ ధనమున్ ధాన్యము విద్యలున్ గలిగి శ్రువస్థానసంభూతుడై, ననునాడే
వందనీయుడగుజ్ఞానంబుండివిత్తంబుచుం, డనవా డెంతటియోగ్యుడైనసభనుం
డన్ పీలు లేకుండువా, నివిపాటింకరుసత్యమాడినను నిందీభూతుడైపోబడున్॥
మ॥ సరికాలంబులనర్ఘసుల్ ఃడవుగా క్షామప్రచారంబులే, జరుగున్ కూటికి

లేక సర్వజనులో౯ దస్సి పెండ్లాముకూ తురుల౯ బాసెపరమ్ముకొందురధము
ల్లోపంబు పాటింపకు, గురువావుల్విడనాడికూడెదరు జ్ఞానుల్ప్రచ్ఛకరూపవరమా
ఉ॥ జేసెడిదొక్కటి౯ పల్కుకు జెప్పెడిదొక్కటియాత్మయొక్కటి౯, వాసెడి
దొక్కటి౯ నిజమబద్ధమునిక్కువంబుగా, గూసెడిదొక్కటి౯గలిగి క్రూరగు
ణంబులకొందరుందురే, దోసములెక్కజేయరు పదుల్గొనజాలరు లోభవృ
త్తులన్ క॥ తనకిష్టంబైనసతి౯ తనకిష్టంబైనవరుని తనుకు౦ దామే
కొనియుందురిష్టపూర్తి౯గ గనకుందురు వర్ణభేద గౌరవవిధముల్
శా॥ విద్యాద్గౌరవము నెడున్గురుకవుల్ విద్యాంసులర్థుల్ హితుల్, వదాన్యంచ
ల్గానవాశ్రయించిననృపుల్ సత్కీర్తి౯ పాటింప, కుద్యద్దోషంబున గౌరవంబు
మరినిందాలాపముల్జూపిసం, పద్వర్ధిష్ణుమత ప్రయుక్తులు సన్మానింపకుందు
రక్కలి౯॥ గీ॥ పురములడవులునడవులు పురములగును ధర్మమొకపాదమైయుండు
ధరణియందు; నప్పుడప్పుడు యుద్ధంబులొప్పపంచ విధమకుటధారులేలు దుర
వృధిపినంత॥ సీ॥ తొలికులంబాది చతుర్వర్ణములవి, తంతుకామినులకు
ద్వాహములును, హిందూనృపాల రాజ్యేందిరపరదేశ, యువనహూ
ణాదిసంప్రాప్తములును, స్వకులధర్మాచార సంబంధహీనంబు. నన్య
మతాచారజన్యములును, యంత్రసాధనములు హావరంగగతులు న,
నూనవిచిత్రవిమానములును, గీ॥ స్త్రీపురుష వస్త్రభూషలు చిహ్న
లన్య రూపములు నంతులేని దుష్ప్రపములు నవ్వి, కన్యవరవిక్రయం
బులఖండరీతి గలుగు కలికాలమందు నోకానోకపుడు॥
క॥ హిందూదేశము వృద్ధుల గందరగోళంబుజెందు కాలవశమున౯
గొందుకొనుమతకలహములు జెందుదురు మహాత్ములెల్ల చెంగోనిడుమల్
గీ॥ భరతఖండంబులోనందు ప్రజవిదేశవిభుల చేజిక్కి యొదిరించువిధదొలంగ్ని
బాధలొంది స్వదేశసంపాదనార్థ లక్షలకొలంది జనులుందురీతిచూపి
మ॥ విపరింతుర౯ వినుమొక్కవేళ నిఖలద్వీపాంతరావాసభూ, ధవులనోర్వక్య
రణపరిచారులయి బాధజెందుచుంద్రస్త్రశ, స్త్రవిశేషంబులఖండమై
దనరు నద్యుద్ధాము హాలాహలా, గ్నివికల్పంబులు కాంబరికలితముల్
నిర్మాణమైనేడుప్పుడు౯। ఉ॥ ఆయువు మానవాళికి పదారు నదేపరమా
యువౌను న,న్యాయముజూపదు౯ పరధనాపహరుల్బలశాలు లంగనల్
హేయగతిన్న వాద్దముల కేప్రసవింత్రు తురుష్కహూణభా, షాయు
తులైపరిపంథమువెసన్ నడిపింతురు నీచజాతులు౯। చ॥ కలియుగధ

ర్మముల్ దెలుప గాఁబలుకాలము బట్టునర్జునా, తెలిపినలాభ మేమియుగ
తంగనఁబోవుటే మీరలేవురున్, జెలిమిఁబ్రపదాత్మజంగలసి చేటుకలిన్ గన
వల్దుమీకు కేవలము గముక్తిమార్గము శుద్ధస్థితిజేకుఱు నిక్కమాడితిన్
వ॥ అని యంతర్హితుం డయ్యె నమ్మునీంద్రుని హితోపదేశంబున కలకదేరి
యర్జునుండు హాస్తినాపురికి వచ్చుచుండె నంత మ॥ జననాథుండు
యుధిష్ఠిరుండచట దుస్స్వప్నంబునుం గాంచి హా, వనితా నిట్లయె పార్థుడే
గిమసలెన్ ద్వారావతిన్ రాని యో, చనయోచింపుము లేనివింతగలి
గెన్ స్వప్నంబులో రాతిరే మనిమాటాడుదుతమ్ముహా మానినిగెబ రంహం
డంబు సంబోధిన్॥ వ॥ అని బహువిచారంబుగ బల్కుచుండ పార్థుం
డేతెంచి పాదంబులకుఁబ్రణమిల్లి దైన్యంబుననిలచిన ధర్మనందనుండిట్లనియె.
సీ॥ తమ్ముడా మోముదుగంటె ధర్వబృందము గెల్చు, వాడునీకింత దైన్యంబు లేదు
కాలకేయత్వ్యేళ్ళ గళమరుతెంబోరు, నాడింతముఖ వివర్ణతయు లేదు
ద్రోణశాంతనవకర్ణులమార్గానగలిల్చు, నాడింతయైన చింతయును లేదు
యాజయదధ నిబహాణకాలమునఁ బోరు నాడింత చిన్నదనంబు లేదు
తేం వరద్వారకన్ మనవారికెల్లరకలయ యదువృష్ణిభోజాంధకులకు సుఖమె
శుభదవాక్కులు నాచెవి సోకనిమ్ము యశుభవార్తలు ప్రతిహతమౌనుగాక
క॥ అనిధర్మజుండు పల్కన్ కనగవ కన్నీరు వరువగ నిటులనియెన్
జననాయక మనమూలపు ధనమది మనలంత్యజించె దైవవశమునన్॥
క॥ ఎవ్వడు మన కాపురుషు జయుం డెవ్వని చేగల్గె మనకు నెవ్వని కృపచే
నివ్వటిలియుంటిమో మన మవ్వనజాక్షుండు దివికివరిగె మహాత్మా
సీ॥ అతనికూర్మినిగదా యంత్రమీనము గూల్చి పరగనిర్జించి ద్రౌపదినిగా
నుట, యతనికూర్మినిగదా యభవు మెప్పించియు దృఢత చేత పాశుపతంబు
గొనుట, యతనికూర్మినిగదా యమరేంద్రపీఠిపై సరినిల్చి బహుమాన
సరణిగొనట, యతనికూర్మినిగదా ధృతరాష్ట్రశతసుత కృతమాయ
లన్ బాసి హితముగొనుట యతనికూర్మిగదాన దీనుత ఘటాత్మ భవ
కృపాచార్యభవ భానుభవ జయద్రథాదిరథికుల గూల్చి జయోదయంబు
గొనుట యట్టిమహాత్ముడు జనియెభూప॥
వ॥ అని బహుభంగుల విలపించుచు రామకృష్ణులనిర్యాణంబు ద్వారకసము
ద్రంబున మునుంగుటయు భిల్లులచేటు పాటుచు వ్యాసోపదేశంబును ము
న్నగు వృత్తాంతంబులు విన్నవించి విహ్వలుండై పడియె నంత ధర్మజుండు.